

PRIME MINISTER'S HOUSE
NEW DELHI

June 9, 1960

MESSAGE

I am interested to learn of the children's magazine "Chandamama". It is rather an unusual feat to issue a children's periodical in six languages. I wish it success.

Jawaharlal Nehru

# భారత ప్రధాని శుభసందేశం

పిల్లల పత్రిక "చందమామ"ను గురించి వినటానికి కుతూహలంగా వుంది. ఆరు భాషల్లో పిల్లల పత్రిక ప్రకటించటం నిజంగా ఒక గొప్ప ప్రజ్ఞే. విజయం కోరుతున్నాను.

జవహర్లాల్ నెహ్రూ



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

"చందమామ" జన్మదిన సంచిక ప్రకటించుకుంటున్నదని తెలిసి పాఠకులు పంపిన ఆశీః పరంపరకు అంతులేదు. ఈ సంచిక వారి ఉత్సాహానికి అనుగుణంగా ఉంటుందని నమ్ముతున్నాము. ఈ సంచికలో "బాపు" త్రివర్ణచిత్రాలు గల "చందమామ ఆత్మకథ", "చిట్టి బొమ్మ" అనే అదనపు వ్యాసాలున్నవి. వీటిని ప్రత్యేకంగా "ఆఫ్‌సెట్"లో ముద్రించాము.

ఈ జన్మదినావకాశాన్ని పురస్కరించుకుని "చందమామ" పాఠకులు లోగడ అయాచితంగా పంపిన ప్రశంసలూ, ఆశీస్సులూ ఈ సంచికలో ప్రకటించుతున్నాము. అందుచేత ఈసారి ప్రశ్నోత్తరాలు లేవు. శ్రీ సత్యనారాయణాచార్యగారి కొత్త గేయకథ "క్షీరసాగర మథనం" దీనిలో ప్రారంభమవుతున్నది.

సంపుటి 27 : జూలై 1960 : సంచిక 1




అభిమన్యుడు పద్మవ్యూహం ప్రవేశించగానే అతను చిక్కిపోయినట్టుగా కౌరవయోధులు జబ్బలుచరిచి, రంకెలుపెట్టి, సింహనాదాలు చేశారు. అయితే త్వరలోనే అభిమన్యుడు వారి ఉత్సాహాన్ని నీరుకార్చేశాడు. అతను కౌరవ సేనపై యముడిలాగా పడి నాశనం చెయ్యసాగాడు. అతని ధాటికి తట్టుకోలేక కౌరవసేనలు చెదరిపోసాగాయి.

దుర్యోధనుడు అలిగి అభిమన్యుడిపైకి వచ్చాడు, అతనికి అండగా కౌరవయోధు లందరూ వచ్చిపడ్డారు. అభిమన్యుడు అందరితోనూ భయంకరంగా పోరుతూ, కర్ణుడి శరీరం దూసుకుపోయేటట్టు బాణంతో కొట్టి, శల్యుణ్ణి మూర్ఛపోగొట్టి, సుషేణుడు, దీర్ఘలోచనుడు, కుండభేది అనే యోధులను చంపేశాడు. శల్యుడి తమ్ముడి తల తెగ వేశాడు. అర్జునుడికీ, కృష్ణుడికీ తెలిసిన అస్త్రాలన్నీ బాలుడైన అభిమన్యుడికి తెలుసును; వాటిని అతను వారితో సమంగా ప్రయోగించ గలిగాడు. అతను ఒక్కొక్క యోధుణ్ణి బలి తీసుకుంటుంటే ద్రోణుడు చూస్తూనే ఉండికూడా అతణ్ణి ఏమీ చెయ్య లేక పోయాడు.

పైపెచ్చు ఆయన దుర్యోధనుడితో, "అహా, ఈ బాలుడు ఎంత గొప్పగా యుద్ధం చేస్తున్నాడో చూశావా? వీడు పాండవులకు ఎందులో తీసిపోతాడు? వీడితో ఎవరు యుద్ధం చెయ్యగలరు? ఎందుకో వదిలేశాడు గాని, కావాలంటే మన సేనలన్నిటినీ వీడే నాశనం చెయ్యగలడు!" అన్నాడు.

ద్రోణుడాడిన ఈ మాటలు దుర్యోధనుడికి శూలాల్లాగా గుచ్చుకున్నాయి. అతను వెటకారంగానూ, కోపంగానూ నవ్వుతూ, కర్ణ దుశ్శాసన శల్య బాహ్లికాది యోధులతో, "పాపం, ఈ బ్రాహ్మడికి అర్జునుడి కుమారుడైన ఈ కుర్రకుంకను చంపే ఉద్దేశం

అట్టమీది బొమ్మ

ఉన్నట్టు లేదు. మీరైనా వెంటనే ఆ పనికి పూనుకోండి!" అన్నాడు.

అప్పుడు దుశ్శాసనుడు, "అన్నా, ఒక్క నిమిషంలో నేను ఈ అభిమన్యుణ్ణి చంపేస్తాను. ఆ వార్త విని కృష్ణార్జునులు కుమిలి చస్తారు. వారి చావుతో పాండవులు ఆత్మహత్యలు చేసేసుకుంటారు. నీకు శత్రు నాశనం అవుతుంది," అంటూ అభిమన్యుడి పైకి వెళ్లాడు. అభిమన్యుడు ఒక్క బాణాన్ని చెవిదాకా లాగి దుశ్శాసనుడి రొమ్ము చీలేలాగ కొట్టాడు. దుశ్శాసనుడు మూర్ఛపోయాడు. అతని రథ సారధి రథాన్ని తొలగించి తీసుకుపోయాడు. అదిచూసి పాండవ యోధులు సింహనాదాలు చేశారు.

కర్ణుడికి కోపం వచ్చింది. అతను బాణాలు వేసుకుంటూ అభిమన్యుడిపైకి వెళ్ళాడు. అభిమన్యుడు ఒకే బాణంతో కర్ణుడి ధ్వజాన్నీ, చేతిలోని బాణాన్నీకూడా నిర్మూలించి అతన్ని అసహాయుణ్ణి చేశాడు. కర్ణుడికి అండగా అతని తమ్ముడు వచ్చేసరికి అభిమన్యుడు ఒక్క బాణంతో వాడి తల తెగి పడేలాగ కొట్టాడు. కర్ణుడు తన తమ్ముణ్ణి చూసి ఏడుస్తూ ఉండగా అభిమన్యుడు అతన్నీ, అతని సైన్యాన్నీ తరమనారంభించాడు. కౌరవసేన కంగారుపడి రెండుగా




చీలి చెరొక దిక్కూ పారిపోసాగింది. ఇక అభిమన్యుడు సాగించిన వధకు అంతులేదు.

అలా శత్రునిర్మూలన చేస్తూ ముందుకు వెళ్ళే అభిమన్యుడికి రక్షగా ధర్మరాజూ, భీముడూ, సాత్యకీ, నకుల సహదేవులూ, ధృష్టద్యుమ్నుడూ, విరాటుడూ, ద్రుపదుడూ వారివారి సేనలూ ముందుకు వచ్చాయి. వారందరినీ ఆనాడు సైంధవుడు అడ్డగించి ఆపగలిగాడు.

దీనికొక కారణం ఉన్నది. ధృతరాష్ట్రుడి అల్లుడైన ఈ సైంధవుడు ఒకప్పుడు ద్రౌపదిని బలవంతాన ఎత్తుకుపోవటానికి ప్రయత్నించి భీముడిచేత పరాభవించబడి, పరమేశ్వరుణ్ణి



గురించి తపస్సు చేసి, శివుణ్ణి కలలో ప్రత్యక్షం చేసుకుని, ఒక్క అర్జునుడు తప్ప మిగిలిన పాండవులందరినీ యుద్ధంలో వారించేలాగ వరం పొందాడు. ఆ వరం ఈనాడు అక్కరకువచ్చింది. అభిమన్యుడు కౌరవసేనలను ఎలా చీకాకుపరిచాడో, సైంధవుడు పాండవసేనలను అలా చీకాకు పరిచి తరిమికొట్టాడు.

అభిమన్యుడు మాత్రం ఒంటరిగా కౌరవసేనలను నిర్మూలించుతూ, తనతో తలపడిన యోధులందరినీ ఓడించుతూ ముందుకు సాగాడు. వృషసేనుడనేవాడు సారథిని పోగొట్టుకుని, ప్రాణాలతో తప్పించుకు పారిపోయాడు. ఇనపకవచం ధరించి వచ్చి వసాతీయుడనేవాడు అభిమన్యుడి చేతిలో చచ్చాడు. ఎందరో యోధులు అభిమన్యుడిపైకి పోయి మళ్ళీ వెనక్కు తిరిగి రాకుండా అతనికి బలి అయిపోయారు.

ఇలా పోయినవారిలో శల్యుడి కొడుకు రుక్మరథుడొకడు. అది చూసి రుక్మరథుడి మిత్రులైన రాజకుమారులు అభిమన్యుడిపై కలియబడ్డారు. అంతమందిని ఒక్కసారి ఎదుర్కొవటానికిగాను అభిమన్యుడు గాంధర్వాస్త్రం ప్రయోగించి వారికందరికీ భ్రమ కలిగించి, అనంతరం వారిని వందల సంఖ్యలో చంపాడు. ఈ దారుణ హత్యాకాండ చూసి కోపంతో దుర్యోధనుడు అభిమన్యుడితో తలపడి ఒక్క క్షణంపాటు మాత్రమే యుద్ధంచేసి, అభిమన్యుడి దెబ్బలకు తాళలేక పారిపోయాడు.

యుద్ధరంగంలో తేరిపార చూడటానికి వీలులేకుండా ఉన్న అభిమన్యుడిపైకి ద్రోణుడూ, అశ్వత్థామా, బృహద్బలుడూ, కృపుడూ, కృతవర్మా, కర్ణుడూ మొదలైన వారు ఏకమై బయలుదేరారు. లక్ష్మణుడు అభిమన్యుడితో తలపడ్డాడు. తనకొడుకుకు అండగా దుర్యోధనుడు వెంట వచ్చాడు. ఇద్దరికీ కొద్దిసేపు భయంకరమైన యుద్ధం

జరిగింది. చివరకు అభిమన్యుడు లక్ష్మణ కుమారుడి తల తెగవేశాడు.

దుర్యోధనుడు శోకాగ్రహాలను పట్టలేక, "ఒరే, వాణ్ణి చంపెయ్యండి!" అని గట్టిగా అరిచాడు. ఈసరికి మిగిలిన యోధులు చేరువకు వచ్చారు. సైంధవుడి తాలూకు యోధులుకూడా వచ్చి చేరారు. అందరూ కలిసి తనతో యుద్ధం చేస్తున్నప్పటికీ అభిమన్యుడు వారిలోని క్రాథపుత్రుడు అనేవాణ్ణి చంపేశాడు. ద్రోణ, కృప, కర్ణ, అశ్వత్థామ, బృహద్బల, కృతవర్మలు తప్ప మిగిలిన వారు వెనక్కు తగ్గారు. ఈ అరుగురూ అభిమన్యుణ్ణి చుట్టుముట్టారు. అభిమన్యుడు ఇంతమందిపైనా బాణవర్షం కురిపిస్తూనే, దుర్యోధనుడి తమ్ములలో ఒకడైన బృందారకుడనేవాణ్ణి చంపేశాడు; కోసల రాజైన బృహద్బలుడి గుర్రాలనూ, ధ్వజాన్నీ, సారథినీ, విల్లునూ కొట్టి, అతను డాలూ, కత్తీ పట్టి మీదికి వచ్చే సమయంలో ఒక్క బాణంతో బృహద్బలుడి గుండె బద్దలుచేసి చంపేశాడు. తరవాత కర్ణుడి వెంటఉన్న అరుగురు మంత్రులను వధించాడు.

ఆ రోజు అభిమన్యుడు పదివేలమంది క్షత్రియులను చంపాడు.

ఈ విధంగా అసహాయశూరుడై పోరాడే అభిమన్యుణ్ణి చంపటానికి ద్రోణుడు తన






అనుచరులతో ఈ విధంగా చెప్పాడు: "వీడి బాణాలు సాటిలేనివి. కవచధారణలో వీడికి అర్జునుడికి గల నేర్పంతా ఉన్నది. వాడి చేతిలో విల్లుండగా మనం ఎంతసేపు పోరినా వాణ్ణి జయించలేము. వీడు ఎందునా అర్జునుడికి తీసిపోడు. ఒక్కసారి వీడి విల్లు విరిచి విరథుణ్ణి చేసినట్టయితే మనం వీణ్ణి చంపగలుగుతాము," అన్నాడు.

ఒక్కసారిగా అందరూ తమతమ పనులు నిర్వర్తించారు. కర్ణుడు అభిమన్యుడి విల్లు కొట్టేశాడు, భోజుడు అతని గుర్రాలు చంపాడు, కృపుడు సారథిని చంపాడు, మిగిలిన వారందరూ అభిమన్యుడిపైన బాణవర్షం కురిపించారు. అభిమన్యుడు డాలూ, కత్తీ పట్టికూడా ఎంతో ప్రతాపం కనబరిచాడు. ఆ స్థితిలోకూడా అతను ఏవరిపైకి దూకుతాడో అని అందరికీ హడలుగానే ఉన్నది. ద్రోణుడు అతని చేతిలోని కత్తిని బాణంతో కొట్టాడు, అదేసమయంలో కర్ణుడు డాలును ఎగరగొట్టాడు.

అభిమన్యుడు తోక తొక్కిన పులిలాగా అయి ఒక చక్రం తీసుకుని ద్రోణుడిపైకి లంఘించాడు. అతని శరీరమంతా రక్తంతో తడిసి ఉన్నది. ఆ చక్రాన్ని కౌరవయోధులు తమ బాణాలతో ముక్కలు ముక్కలుగా కొట్టేశారు. అభిమన్యుడు ఒక గద తీసుకుని అశ్వత్థామ రథంపైకి వెళ్ళేసరికి, అశ్వత్థామ మూడడుగులు వెనక్కు వేశాడు. అభిమన్యుడు గదతో అతని గుర్రాలనూ, సారథినీ చంపాడు, శకుని తాలూకు యోధులను డెబ్భయ్యేనిమిదిమందిని చంపాడు, ఏడుగురు కైకేయ యోధులను చంపాడు, దుశ్శాసనుడి కొడుకు రథంపైకి వెళ్ళాడు.

దుశ్శాసనుడి కొడుకు మండిపడి ఒక గద తీసుకుని అభిమన్యుడితో కలియబడ్డాడు. ఇద్దరూ గదాయుద్ధం చేసి కింద పడ్డారు. అప్పటికి అభిమన్యుడి పని అయిపోయింది. అతను బాగా అలిసిపోయి, వీర



సించి ఉన్నాడు. దుశ్శాసనుడి కొడుకు ముందు లేచి నిలబడి, లేవటానికి ప్రయత్నిస్తున్న అభిమన్యుడి తలమీద తన గదతో కొట్టాడు. అభిమన్యుడు పడిపోయి, మరి కదలలేదు.

అభిమన్యుడు మరణించాడని కౌరవులు పొందిన ఆనందానికి మేరలేదు. వారు సింహనాదాలు చేశారు. పాండవబలాలు పారిపోసాగాయి. ఆరుగురు మహాయోధులు కలిసి ఒక అసహాయుడైన పసివాణ్ణి చంపారు. అయితే ఆ పసివాడు నూరుమంది పెట్టుగా పోరాడి ఎంతో శత్రునిర్మూలనం చేశాడు.

పాండవయోధులందరూ తమ అస్త్రాలను అవతల పారేసి ధర్మరాజు చుట్టూ మూగారు. "అయ్యో, ఎంత పాపాత్ముణ్ణి! నేనే అభిమన్యుణ్ణి ఆ పద్మవ్యూహంలోకి చావటానికి పంపాను. ఇక అర్జునుడి ముఖం ఎలా చూసేది? కృష్ణుడి ముఖం ఎలా చూసేది? ఇంక నాకు జయమెందుకు? రాజ్యమెందుకు?" అని ధర్మరాజు వాపోయాడు. అప్పుడు వ్యాసమహాముని అక్కడికి వచ్చి, "ధర్మరాజా, శోకించకు. అభిమన్యుడి కంటె కూడా మహాయోధులైనవారు సహితం రణరంగంలో మరణించారు. బ్రహ్మలగాయతు సృష్టిలో ప్రతి ఒక్కరికీ చావు తప్పదు," అని ఓదార్చి, ధర్మరాజుకు మనశ్శాంతి కలగటంకోసం కొన్ని కథలు చెప్పి వెళ్ళిపోయాడు.

ఇంతలో సూర్యాస్తమానమయింది. సైన్యాలు తమ శిబిరాలకు వెళ్ళిపోయాయి. అర్జునుడు సంశప్తకులను నిర్మూలించి కృష్ణుడితో తన శిబిరానికి తిరిగివస్తూ దుశ్శకునాలు గమనించి కలతపడ్డాడు. ధర్మరాజుకేమైనా ప్రమాదం జరిగిందేమో అనుకున్నాడు. శిబిరం చేరవస్తూండగా అతని అందోళన మరింత హెచ్చింది. ఎలాటి ఆర్భాటాలూ, మంగళతూర్యాలూ, దుందుభులూ, వీణావాద్యాలూ లేక శిబిరం నిశ్శబ్దంగా,

పాడుబడినట్టుగా ఉన్నది. వందిమాగధ స్తోత్రాలు లేవు. అర్జునుడి కంటపడిన యోధులు తలలు వంచి తప్పుకుపోతున్నారు.

కృష్ణార్జునులు శిబిరం ప్రవేశించి మిగిలిన పాండవులు చింతాక్రాంతులై కూర్చుని ఉన్నచోటికి వెళ్ళి చివరకు అభిమన్యు వధా వృత్తాంతం తెలుసుకున్నారు. అర్జునుడి దుఃఖం కట్టలు తెగి ప్రవహించింది. తన కొడుకును కళ్ళారా చూసుకునేటందుకు తానుకూడా చచ్చిపోవటం తప్ప వేరే మార్గం లేదనిపించింది. తరవాత అతని దుఃఖంతో ఆందోళన ఏకమయింది. "మీరంతా ఉండి నా కొడుకును ఎలా చావనిచ్చారు? మీ ఆయుధాలూ, కవచాలూ అలంకార మాత్రమేనా?" అని అడిగాడు.

అప్పుడు ధర్మరాజు సైంధవుడు తమనందరినీ ఎలా అడ్డినదీ వివరించాడు. అది విని అర్జునుడు వెర్రివాడులాగా అయిపోయి, చేతులు నులుపుకుంటూ, "ఓ యోధులారా, రేపు సైంధవుణ్ణి చంపేస్తాను! వాడు కౌరవులను వదిలిపెట్టి పోకుండానే ఉండాలి, మమ్మల్నిగాని, ధర్మరాజునుగాని, కృష్ణుణ్ణిగాని శరణుచొరకుండానే ఉండాలి, ఎవరు వాణ్ణి రక్షించినా సరే రేపు రణరంగంలో ఉంటే వాడు నాచేత చచ్చాడే! నాతో ఉండిన స్నేహాన్ని మరిచి వాడు దుర్యోధనుడి పక్షం కావటమే గాక నా కొడుకు చావుకు కారకుడౌతాడా? రేపు సూర్యాస్తమయం లోపుగా వాణ్ణి చంపకపోయానో యుద్ధరంగంలోనే చితి పేర్చుకుని అందులో ప్రవేశిస్తాను. ఇదే నా ప్రతిజ్ఞ. దీనికి తప్పినట్టయితే పితృ హంతకులూ, మాతృ హంతకులూ, సమస్త పాపులూ పోయేగతికి పోతాను!" అని ఘోరప్రమాణం చేశాడు.

వెంటనే కృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు దేవదత్తం పూరించాడు. పాడుపడినట్టున్న పాండవ శిబిరంలో విజయార్భటులు మారుమోగాయి.






## 7

[ఉగ్రాక్షుడికి దొరికిపోయిన అమరపాలుడు, చిత్రసేనుడితో జ్వాలాద్వీపవాసులను గురించిన కొన్ని రహస్యాలు చెప్పాడు. రాజద్రోహి నాగవర్మను గురించికూడా కొన్ని రహస్యాలు చిత్రసేనుడికి తెలిసినై. ఆ ద్రోహికి సహాయం చేస్తున్న పులిరాయుళ్ళనూ, వాళ్ల భయంకర పక్షుల్ని కొట్టాలకు నిప్పుపెట్టి సర్వనాశనం చేస్తానని అమరపాలుడు అన్నాడు తరవాత—]

అమరపాలుడి మాటలు వింటూనే చిత్రసేనుడు ఉగ్రాక్షుడికేసి చూశాడు. ఉగ్రాక్షుడికి అమరపాలుడి మాటల్లో పూర్తి విశ్వాసం కలిగింది. అతడు వుత్సాహంగా లేచి నిలబడి, "నా సేవకులైన రాక్షసుల్లో యిద్దరు ముగ్గుర్ని తోడుగా పంపుతాను. ఈ పని సానుకూలం అయితే, అమరపాలుణ్ణి గొప్పగా బహూకరించగలను," అన్నాడు.

చిత్రసేనుడు ఓ క్షణకాలం ఆలోచించి, "పనిలో పనిగా, ఆ కపిలపురాన్నికూడా ఆక్రమించుకోవటం బావుంటుందిగదా? రాజును చెరపట్టిన సేనాని నాగవర్మ. నా తండ్రిగారి రాజ్యమైన ధవళగిరిమీదికి దాడి వెళ్ళాడు. బహుశా యిప్పుడు కపిలపురానికి రక్షణగా పెద్ద సైన్యం వుండి వుండదు. కనుక మనం హఠాత్తుగా దాడిచేస్తే కపిలపురం కోటను ఆక్రమించుకోవచ్చు," అన్నాడు.

చిత్రసేనుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు ఎగిరి గంతేసి, "మహా పసందైన ఆలోచన, చిత్రసేనా! మనం కపిలపురాన్ని



ఆక్రమించుకోవటమే గాదు, వీరసింహ మహా రాజు కుమార్తె కాంతిమతినికూడా, నాగ వర్మ పాలుకాకుండా కాపాడదాం. నువ్వు యువకుడివి, బ్రహ్మచారివి. ఒక్క వేటుతో నీ రాజ్యం రెండితలు కావటమే గాక, గొప్ప సౌందర్యవతి అయిన రాజకుమార్తెకూడా నీకు భార్య అవుతుంది," అన్నాడు.

ఉగ్రాక్షుడి మాటలు చిత్రసేనుడికి ఏవ గింపు కలిగించినై. కపిలపురం రాజైన వీర సింహుడు బతికి వుండగానే, అతడి రాజ్యాన్ని తన రాజ్యంలో కలుపుకోవటంగాని, అతడి కుమార్తెను తండ్రి అనుమతి లేకుండా వివాహం ఆడటంగాని న్యాయం అనిపించు



కోదు. పైగా ఆ కాంతిమతి యీసరికే మరొక వరుణ్ణి ఎన్నుకుని వుండవచ్చు. రాక్షసుడైన ఉగ్రాక్షుడికి మానవులు పాటించే మంచీ మర్యాదల గురించి ఏమీ తెలియదు.

"ఉగ్రాక్షా! ఇప్పటి మన ప్రయత్నం నాగవర్మను ఓడించటం. ఆ విధంగా మనకు పక్కలో బల్లెమైన ఒక దుష్టుడి పీడ విరగడ అవుతుంది. కపిలపుర రాజ్యానికి వీర సింహుణ్ణే తిరిగి రాజుగా పట్టాభిషేకం చేస్తాం. కాని, ఇవన్నీ సాధించాలంటే ముందుగా మనం ఆ భయంకర పక్షుల్నీ, వాటి రౌతుల్నీ తుదముట్టించాలి. వాళ్లు ఆ రాజ్యం పొలిమేరలలో వుండగా మనం ఎంత సైన్యంతో వెళ్ళినా కపిలపురాన్ని ఆక్రమించుకోలేం సరిగదా, మనమే వాళ్ళ చేతుల్లో సర్వనాశనం అవుతాం," అన్నాడు చిత్రసేనుడు.

"ఆ బాధ్యత నామీద పెట్టండి. మీరు సైన్యాలతో అడవిలో దాగివుండి, భయంకర పక్షులు కొట్టాల్లో మాడి చావగానే, కపిల పురంమీద దాడి చెయ్యవచ్చు," అన్నాడు అమరపాలుడు.

ఇందుకు చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ అంగీకరించారు. వెంటనే అమరపాలుడికి తోడుగా ఇద్దరు రాక్షసులూ, నలుగురు చిత్ర





సేనుడి సైనికఃలూ బయలుదేరారు. అమరపాలుడు వాళ్లను వెంటబెట్టుకుని చూస్తూండగానే అడవిచెట్లలో మాయమయాడు. చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ తమ సైన్యాలనూ, అనుచరులనూ సమాయత్తం చేసేందుకు భటులద్వారా ఆజ్ఞలు పంపారు.

ఈలోపల అమరపాలుడు సైనికుల్ని వెంటపెట్టుకుని, అడవిదారుల వెంట ప్రయాణిస్తూ మిట్టమధ్యాహ్నం వేళకు, కపిలపురం సమీపాన గల అడవిని చేరాడు. ఆ అడవిలోనే దాదాపు నూరు భయంకర పక్షులు పెద్దపెద్ద కొట్టాలలో కట్టివేయబడి వున్నవి. వాటిని కాపలా కాసేవాళ్లు ఆ సమీపంలోనే చిన్న చిన్న గృహాల్లో వుంటున్నారు.

అమరపాలుడు తన అనుచరు లందర్నీ ఒకచోట చేర్చి, వారికి కాపలావాళ్లుండే గృహాలు చూపుతూ, "నేను ఈ ప్రాంతమంతా బాగా ఎరిగినవాణ్ణి. ఆ కాపలావాళ్లల్లోకూడా ప్రతి ఒక్కడూ నాకు తెలుసు. నేను ముందుగా వాళ్లదగ్గిరకు వెళ్లి అందర్నీ ఒకచోట చేర్చుతాను. ఆ సమయంలో మీరు హఠాత్తుగా వాళ్లమీద పడి నిర్దాక్షిణ్యంగా చంపేయండి. ఆ తరువాత భయంకర పక్షులున్న కొట్టాలకు నిప్పు పెడదాం,"




అన్నాడు. ఇందుకు అందరూ సరేనన్నారు. తరవాత అమరపాలుడు కాపలావాళ్ల గృహాలకేసి పరిగెత్తుతూ, కేకలు పెట్టాడు. ఆ కేకలు వింటూనే కాపలావాళ్లు ఇళ్లల్లోనుంచి హడావిడిగా బయటికి వచ్చి, అమరపాలుణ్ణి చుట్టుముట్టారు. వాళ్లు అందరూ కలిసి దాదాపు ఇరవై మందికన్న ఎక్కువ వుండరు.

"అమరపాలా! బతికి బయటపడ్డావా? నువ్వు ఆ రాకసుల చేతిలో చిక్కి చచ్చిపోయావని మేమంతా అనుకున్నాం," అన్నారు వాళ్లు.

"చావవలసిన వాణ్ణే, కాని భూమిమీద యింకా నూకలుండి ప్రాణాలతో పారిపోయి




యిక్కడికి రాగలిగాను. ఎన్ని జిత్తులు ప్రయోగించి వాళ్ల వలలో పడకుండా బయట పడ్డానో, ఆ పరమాత్ముడికే ఎరుక. పక్షుల్లో ఏ ఒకటీ చావకుండా, అన్నీ కొట్టాలకు చేరినయ్యా?" అన్నాడు అమరపాలుడు.

"అన్నీ సురక్షితంగానే వున్నవి. నాగవర్మ మహారాజు ధవళగిరిమీదికి దండువెడలాడు. యిప్పుడు కపిలపురానిక రక్షకులం మనమే. కోటలో కొద్దిమంది భటులు మాత్రమే వున్నారు. వారైనా కోట రక్షణకన్న రాజ కుమార్తె కాంతిమతి పారిపోకుండా చూసేందుకే వుంచబడ్డారు. నాగవర్మరాజు సర్వ సైన్యాల్నీ వెంట బెట్టుకుని ముందు ధవళగిరినీ, ఆ తరవాత అడవిలో వున్న చిత్రసేనుడి కోటనూ ఆక్రమించుకుని— అంతా ఓ చుట్టు చుట్టి యిక్కడికి వస్తారు. ఆ తరవాత మనలో ప్రతి ఒక్కడూ ఒక సామంత రాజవుతాడనుకో," అన్నారు వాళ్లు.

ఆ మాటలు వింటూనే అమరపాలుడు పరమానందం చెందినవాడిలా పెద్దగా నవ్వి, గంతులు వేస్తూ చేతులు పైకెత్తి సంజ్ఞలు చేశాడు. మరుక్షణంలో చెట్ల చాటునుంచి భయంకరంగా రంకెలు వేస్తూ రాక్షసులూ, సైనికులూ పరుగెత్తుకుని వచ్చి కాపలావాళ్ల మీద పడ్డారు. అదే అదనులో అమరపాలుడు కూడా కత్తిదూసి. కాపలావాళ్ళయిన జ్వాలా ద్వీపవాసుల్ని నరకసాగాడు. నిరాయుధులుగా వున్న ఆ క్రూరులు నిమిషాలమీద యమపురికి ప్రయాణంకట్టారు.

ఆ వెంటనే అమరపాలుడూ, రాక్షసులూ ఇళ్ళలోకి జొరపడి నూనెలో ముంచిన కాగడాలను వెలిగించి, భయంకర పక్షులు కట్టి వేయబడివున్న తాటాకు కొట్టాలకు అన్ని వైపులనుంచీ నిప్పుపెట్టారు. గాలితాకిడికి క్షణాలమీద కొట్టాలన్నీ ముట్టుకుని భగభగ మంటూ మండసాగినై. బలమైన ఇనపగొలుసులతో కట్టివేయబడిన భయంకర పక్షులు అగ్నిజ్వాలల నుంచి బయటపడేందుకు భీక




రంగా అరుస్తూ, ముక్కులతో కాళ్ళ గొలుసులను ఛేదించేందుకు ప్రయత్నించినై. కాని, ఈలోపలే కొట్టాల కప్పులు కాలి దభీమంటూ లోపలికి కూలటంతో, ఆ మంటల్లో కొన్ని కాలిపోయినై. గొలుసులను ఛేదించుకోగలిగిన కొన్ని భయంకర పక్షులు మండుతూన్న దేహాలతో పైకెగిరి అంతలోనే భూమి మీద పడిపోయి, గిలగిల కొట్టుకుంటూ ప్రాణాలు వదిలినై.

అమరపాలుడూ అతని అనుచరులూ సంతోషం పట్టలేక కుప్పిగంతులు వేస్తూ పాటలు పాడసాగారు. వున్నట్టుండి దాపుల వున్న ఒకానొక కొండప్రాంతాన్నుంచి భేరీ మోతలు వినబడినై. ఆ ధ్వని వింటూనే అమరపాలుడు ఆ దిక్కుకేసి చూస్తూ, "చిత్రసేన మహారాజూ, ఉగ్రాక్షుడూ సైన్యాలతో వస్తున్నారు. ఇక్కడ మనం రేపిన మంటలు వాళ్ళకు కనబడి వుంటవి. ఇక మనం కపిలపురాన్ని ఆక్రమించుకోవటమే తరువాయి. మీలో ఒకరిద్దరు సైన్యాలకు ఎదురు వెళ్ళి, యిక్కడ పని సానుకూలం అయినట్టు చెప్పండి," అన్నాడు అనుచరులతో. అమరపాలుడు యిలా చెప్పగానే రాక్షసులిద్దరు రాతి గదలను గిర్రుగిర్రున తిప్పుతూ, పొదలమీదినుంచి దూకుతూ భేరీ ధ్వనులు వచ్చినవైపుకు పరిగెత్తారు.

కొద్దిసేపటి తరవాత చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ సైన్యంతో అక్కడికి వచ్చారు. వాళ్లకు అమరపాలుడు చేసిన భీభత్సం కంటబడింది. ఇంకా అక్కడా యిక్కడా మంటలు లేస్తూ, ఆకాశంకేసి పొగలు జిమ్ముతున్న భయంకర పక్షుల కొట్టాలను చూసి ఉగ్రాక్షుడు పట్టలేని ఆనందంతో అమరపాలుణ్ణి సమీపించి, అతణ్ణి చేతులు పట్టుకుని లేవనెత్తి గాలిలో గిర్రున తిప్పుతూ, "ఆహా, వీరుడివంటే నువ్వోయ్, అమరపాలా! నా అడవికి శత్రుభయం లేకుండా చేశావ్. ఏంకావాలో కోరుకో!" అన్నాడు.



"నీ తిప్పడికి గుండెలవిసి చావకముందే, నన్ను వదిలిపెట్టు, అంతే చాలు!" అన్నాడు అమరపాలుడు ఆయాసపడుతూ.

ఉగ్రాక్షుడు అతణ్ణి తిరిగి భూమిమీద నిలబెట్టి భుజం తడుతూ, "ఒక్క భయంకర పక్షికూడా పారిపోకుండా, అన్నిటినీ నిప్పుల్లో మాడ్చావుగదా?" అని అడిగాడు.

"అవును, ఒక్కగానొక్కటికూడా పారిపోలేదు. ఇక మిగిలిందల్లా వాటి రౌతుల్లో కొందరు. ఇక్కడ దాదాపు ఇరవైమంది చచ్చారు. తతిమ్మావాళ్లు కపిలపురం కోటలో వుంటారని నా అనుమానం," అన్నాడు అమరపాలుడు.

"ఓం, ఇక వాళ్ళెక్కడికి పోతారు? మనం సైన్యాలతో కోటను చుట్టుముట్టి భస్మీపటలం చేసేస్తాం," అంటూ ఉగ్రాక్షుడు జబ్బలు చరిచాడు.

"అలాచేస్తే, రాజకుమార్తె కాంతిమతికూడా ప్రమాదం కలుగుతుంది. ఆ కోటను పట్టుకునే పని నాకు వదులు, ఉగ్రాక్షా!" అన్నాడు చిత్రసేనుడు.

"అవునవును, ఆ అమ్మాయిమాటే మరిచాను. కోటకు ఎలాంటి హానీ జరక్కూడదు, విన్నారా?" అంటూ ఉగ్రాక్షుడు తన సేవకులకేసి గుడ్లురిమాడు.



"విన్నాం, విన్నాం మహానాయకా!" అంటూ వాళ్లు ఏకకంఠంగా కేకలు పెట్టారు.

ఆ తరవాత అమరపాలుడి నాయకత్వం కింద పదిమంది అశ్వసైనికులు వేగు చూసేందుకు కపిలపురం వైపుకు పంపబడ్డారు. మిగిలిన సైనికులు వంట తయారు చేసే పనిలో నిమగ్నమయారు.

సూర్యుడు పడమటిదిక్కుకు వాలుతున్నాడు. సైనికులు భోజనాలు ముగించి చెట్ల నీడల్లో విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆ సమయంలో వేగు పంపబడిన అశ్వికుల్లో ఒకడు అక్కడికి వచ్చి, "మహారాజా! ప్రమాదం. యాభై అరవైమంది పులి



రాయుళ్లు రాజకుమార్తెను మేనాలో ఎక్కించుకుని, కోటవదిలి అడవిలో ఎక్కడికో పోతున్నారు," అని చెప్పాడు.

ఈ వార్త వింటూనే చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూకూడా తుళ్లిపడ్డారు. ఇక్కడ భయంకర పక్షులు మరణించిన సంగతి, కపిలపురం కోటలో వున్న పులిరాయుళ్లకు తెలిసి వుంటుంది. ఇక్కడ లేచిన మంటలూ, పొగా ఆ విషయాన్ని బయట పెట్టివుంటవి. అందువల్ల యిక కోట తమ రక్షణకు ఉపయోగించదని తెలుసుకుని, వాళ్లు రాజకుమార్తెను ఎక్కడో కొండల్లో దాచేందుకు తీసుకుపోతూ వుండి వుంటారు.

చిత్రసేనుడు యిలా వూహించి, తన సైనికుల్లో రాటుతేలిన యోధులు యాభై మందినీ, ఉగ్రాక్షుణ్ణీ అతడి అనుచరుల్లో కొద్దిమందినీ వెంటపెట్టుకుని, రాజకుమార్తె కోసం అడ్డదారివెంట బయలుదేరాడు. తతిమ్మా సైన్యం అమరపాలుడి నాయకత్వాన కపిలపురం కోట వశపరచుకునేందుకు వెంటనే బయలుదేరవలసిందిగా ఆజ్ఞాపించాడు.

వేగు వెళ్లిన అశ్వికుడు దారి చూపగా కొద్ది సేపటికల్లా చిత్రసేనుడు తన అనుచరులతో పులిరాయుళ్లు వున్న ప్రాంతానికి వచ్చాడు. వేగువాడు చెప్పినట్టుగానే ఒక మేనాను నలుగురు బోయీలు మోస్తున్నారు. దానికి ముందూ వెనకా కత్తులూ, కటార్లూ ధరించిన పులిరాయుళ్లు నడుస్తున్నారు.

చిత్రసేనుడు తమను సమీపిస్తూండటం చూస్తూనే, పులిరాయుళ్ల నాయకుడు కత్తి పైకెత్తి భీకరంగా గర్జిస్తూ, "మేనా దించండి," అని బోయీలను ఆజ్ఞాపించి, తన అనుచరులతో, "మన గొంతులో ఊపిరి వుండగా, కాంతిమతి శత్రువుల చేజిక్కరాదు. మనలో ఆఖరివాడు చచ్చే ముందు, ఆమెను చంపి చావాలి. ఇది మహారాజు నాగవర్మగారు యిచ్చిన ఆజ్ఞ!" అన్నాడు.—(ఇంకా వుంది)






# బలవంతప్రు పెళ్లి

విసుగుచెందని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్లి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీవు చాలా మొండి వాడివిలాగా కనపడుతున్నావు. వెనకటికి అగ్నిమిత్రుడుకూడా తన పట్టుదల మాని కుంతలను వివాహమాడాడు గాని, నీవు నీ పట్టు వదిలేటట్టు లేవు. నీకు శ్రమ తెలియ కుండా ఉండగలందులకు వారిద్దరి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

పూర్వం కపిత్థదేశానికి రాజధాని అయిన కపిత్థ నగరంలో కాళీవర్మ అనే ఒక వృద్ధ క్షత్రియుడుండేవాడు. అయన ఒకప్పుడు రాజుగారి కొలువు చేసి, ఎన్నో యుద్ధాలలో వీరోచితంగా పోరాడి గొప్ప కీర్తి సంపాదించు కున్నవాడు. ఇప్పుడాయన వయసు ఎనభై

## బేతాళ కథలు




సంవత్సరాలు. కపిత్థనగరం ఒక కొండ చరియపైన కట్టినది. దాని దక్షిణపు భాగంలో కాళీవర్మకు చిన్న కోటలాటి భవనం ఉన్నది. ఆ భవనానికి దక్షిణంగా అగాధమైన లోయ ఉన్నది. కాళీవర్మకు కుటుంబమంటూ లేదు. అంత భవనంలోనూ ఆయనా, ఆయన మనమరాలు కుంతల అనే పిల్లా మాత్రమే ఉండేవారు. అయితే ఆయనకు ఒక వంద మంది సొంత సైనికులుండేవారు, ఇతర పరిచారకులుండేవారు. వీరంతా ఆ భవనం లోనే ఉండేవారు.

కుంతల బుద్ధి తెలిసినప్పటినుంచీ తాత గారి వద్దనే పెరిగింది. ఎందుచేతనంటే



ఆమెకు చిన్నతనంలోనే తల్లిదండ్రు లిద్దరూ పోయారు. తన తాతగారి ఇంటనే పెరిగి నప్పటికీ ఆమెకు ఆయనదగ్గిర ఏమాత్రమూ చనువు లేదు. అందుచేత ఆమెకు జీవితం ఒక ఖైదులాగా గడిచింది. ఆమె ఒక్క ముచ్చటగాని, మురిపెంగాని ఎరగదు. ఆమె మనసుకు కష్టం కలిగితే ఓదార్చేవారు లేరు, ఆనందం కలిగితే ఆ ఆనందాన్ని పంచు కునేవారు లేరు. ఆమె ఎప్పుడు ఎలా ప్రవర్తించాలో తాతగారు శాసించేవాడు. ఆమె అలా కత్తిమీద సాము చేయటానికి అలవాటు పడిపోయింది.

ఒక పండగనాడు కుంతల దేవాలయానికి వెళ్లింది. ఆమె దేవి దర్శనం చేసుకుని బయటికి వస్తుండగా ఒక క్షత్రియ యువకుడు ఆమెను సమీపించి, "నీతో రెండు క్షణాల సేపు మాట్లాడాలి. ఈ రాత్రికి మీ తలవాకిలి తలుపు తెరిచి ఉండేలాగు చూడు!" అని రహస్యంగా అన్నాడు.

అతను ఎవరో కుంతల ఎరగదు. అతను తనతో ఏమి మాట్లాడగోరాడో ఆమెకు తెలియదు. ఆమెమీద ఎన్నడూ ఎవరూ ఎలాటి అభిమానమూ చూపి ఉండలేదు. ఈ యువకుడు మొట్టమొదటిసారిగా ఆమె పైన అభిమానం చూపిన కారణంచేత





ఆమె మనసులో అతనిపట్ల కొంత సానుభూతి కలిగింది. అందుచేతనే ఈ యువకుణ్ణి గురించి ఆమె తన తాతగారితో చెప్పదలచ లేదు. కాని కాళీవర్మకు ఈ సంగతి వెంటనే తెలిసింది. కుంతల, దేవి ఆలయానికి బయలుదేరిన మరుక్షణమే ఆయన తన మనుషులను ముగ్గురిని, ఆమెకు తెలియకుండా వెన్నాడటానికి పంపాడు. వారిలో ఒకడు కుంతలకన్న ముందుగానే ఇంటికి తిరిగి వచ్చి, కుంతలతో ఆలయం బయట ఎవరో క్షత్రియ యువకుడు క్షణంపాటు ఏదో రహస్యం మాట్లాడిన సంగతి కాళీవర్మకు తెలిపాడు.

కుంతల ఇంటికి రాగానే కాళీవర్మ ఆమెను మామూలు ప్రశ్నలు వేసి, "తెలిసినవారెవరైనా కనిపించారా?" అని అడిగాడు.

"ఎవరూ కనిపించలేదు. దేవి దర్శనం కాగానే నేరుగా ఇంటికి వచ్చేశాను," అన్నది కుంతల.

"ఆలయం బయట నీతో మాట్లాడిన యువకుడి మాట ఏమిటి?" అన్నాడు కాళీవర్మ.

కుంతల ముఖం వెలవెలపోయింది. ఆమె వాలకం చూసి కాళీవర్మ ఆమె దోషి అని రూఢిచేసుకున్నాడు. ఆయన తన మనమరాలితో ఇలా అన్నాడు:

"బుద్ధి తెలిసిన నాటినుంచీ నా శిక్షణలో పెరిగినప్పటికీ నీకు మన వంశం ఎలాటిదో, మనం ఎంత ఆత్మగౌరవం కలవాళ్ళమో నీకు తెలిసిరానట్టున్నది. నీవు నా అనుమతి లేకుండా ఎవరినో ప్రేమించటం ఒక తప్పు. మీరిద్దరూ బహిరంగంగా గుసగుసలాడటం లోకానికి తెలిసిపోయాక మీకు వివాహం జరగకపోతే అది మరింత పెద్దతప్పవుతుంది. వాడు నీకు తగినవాడు అయినపక్షంలో ఎవరికీ ఇబ్బంది లేదు; తగినవాడు కాని పక్షంలో అందుకు ఫలితం నీవే బతికున్న




న్నాళ్ళూ అనుభవించుతావు. నేనుగాని, మరొకరుగాని నీకు చేయగల సహాయం ఏమీ ఉండదు. చెప్పు, ఎవడు వాడు? వాడి పేరేమిటి? వాడి ఇల్లు ఎక్కడ?"

ఈ ప్రశ్నలకు కుంతల దిగ్భ్రమ చెంది తనకు ఆ మనిషి ఎవరో తెలియదన్నది.

"చూశావా? వాణ్ణి పెళ్ళాడవలిసి వస్తుందని అబద్ధాలాడుతున్నావు. నీకు వాణ్ణి పెళ్లి చేసి తీరుతాను. కావాలన్నా తప్పించుకోలేవు. వాడు నీతో ఏమని చెప్పాడు?" అని కాళీవర్మ కుంతలను అడిగాడు.

"నాతో కొద్దిగా మాట్లాడవలిసి ఉన్నదన్నాడు. రాత్రికి తలవాకిలి తలుపు తెరిచి ఉంచమన్నాడు," అన్నది కుంతల జరిగినది దాచకుండా.

"సరే, మిగిలినది నేను చూస్తాను," అన్నాడు కాళీవర్మ.

తనను ఆ యువకుడికిచ్చి పెళ్లి చెయ్యటంలో తనకు ఏదో శిక్ష ఉన్నట్టు కుంతల భావించలేదు. తనమీద ఇంత అభిమానం చూపేవాణ్ణి ఎవడినైనా సరే పెళ్లాడి ఈ చెరలాటి జీవితంనుంచి బయట పడటానికి ఆమె సిద్ధంగానే ఉన్నది.

ఆ రాత్రి దీపాలు పెట్టేవేళ కుంతలను పెళ్లికూతుర్ని చేశారు. ఒక పురోహితుణ్ణి పిలిపించి పెళ్లితంతు జరిపించటానికి సిద్ధంగా ఉంచారు.

*　　*　　*

కొద్దిరోజుల క్రితం కపిత్థనగరానికి అగ్నిమిత్రుడనే ఒక క్షత్రియ యువకుడు రాజుగారి కొలువు సంపాదించ వచ్చి ఒక తెలిసినవారి ఇంట దిగాడు. అతను రోజూ నగరం చూడబోయి చీకటి పడేలోగా తిరిగి ఇల్లు చేరుతూ ఉండేవాడు. చీకటి పడినాక వీధులలో తిరగటం ప్రమాదం. ఎందుకంటే, నగరంలో అరాచకం హెచ్చుగా ఉండటంచేత రాత్రివేళ ఎవరైనా ఆయుధాలు ధరించి ఎదురుపడితే మీద పడి

పాడిచెయ్యమని ఉత్తరువు పొంది సైనికులు గస్తీ తిరుగుతున్నారు.

ఒకనాడు ఈ గస్తీమాట మరిచిపోయి అగ్నిమిత్రుడు నగర పరిసరాల గల కొండ లన్నీ సంచారంచేసి, చీకటిపడి నగరం ప్రవేశించాడు. అసలే అమావాస్య చీకటి. దానికి తోడు ఆకాశంనిండా మబ్బులుండటం చేత కన్ను పొడుచుకున్నా కానరావటం లేదు. ఆ చీకటిలో అతను దారి తప్పాడు. ఎన్నో సందులూ గొందులూ తిరిగినా అతని బస ఉండే ప్రాంతం తగలలేదు.

అతను ఎలా చేరాడో నగరపు దక్షిణ ప్రాంతం చేరాడు. అతను ఒక పెద్ద భవంతి సమీపానికి వచ్చేసరికి సైనికులు పెద్దగా నవ్వుతూ, పాటలు పాడుతూ తనకేసి రావటమూ, వారి దివిటీల వెలుగూ తెలియ వచ్చింది. ఆ సైనికులు తాగిఉన్నట్టు కూడా అతనికి తోచింది.

యోధుడిలాగా కత్తి ధరించిన తాను వారి కంట పడటం క్షేమం కాదనుకుని అగ్నిమిత్రుడు ఆ భవనం తలవాకిలి తలుపును ఆనుకుని ఒదిగి నిలబడ్డాడు. చిత్రంగా, అతని బరువు పడగానే ఆ తలుపు కాస్తా తెరుచుకున్నది. ఇదీ మేలే, అనుకుని అతను చప్పున లోపలికి వెళ్లి తలుపు మూసే




సరికి—ఎవరో అతన్ని చుట్టుముట్టి పట్టేసి పై అంతస్తుకు తీసుకుపోయారు!

పైన ఒక విశాలమైన గదిలో ఒక అతి వృద్ధుడు కూచుని ఉన్నాడు. అగ్నిమిత్రుణ్ణి పట్టుకున్నవాళ్లు అతన్ని ఆ వృద్ధుడున్న గదిలో విడిచి బయటికి వెళ్లిపోయారు.

"కూచో! నీకోసమే ఎదురు చూస్తున్నాను. నీకిపాటి అంద చందాలుంటాయనీ, నీలో ఇంతగా ఉత్తమ క్షత్రియలక్షణా లుంటా యనీకూడా నేను అనుకోలేదు," అన్నాడు వృద్ధుడు. ఆయనే కాళీవర్మ.

"మీరు పొరబడ్డారు. నేను మిమ్మల్ని ఎన్నడూ చూడలేదు. నన్ను చూసి ఎవరను



కున్నారో! నా పేరు అగ్నిమిత్రుడు," అంటూ అతను తన వివరాలన్నీ చెప్పాడు.

కాళీవర్మ నవ్వి, "నన్ను నీవు చూడలేదు కాని నా మనమరాలిని బాగా ఎరుగుదువు. నీకు దాన్ని పెళ్లాడే ఉద్దేశం స్వతహాగా ఉన్నదో లేదో నాకైతే తెలియదు గాని బలవంతాన మీ ఇద్దరికీ పెళ్లి చెయ్యటానికి నిశ్చయించాను. పురోహితుడుకూడా సిద్ధంగా ఉన్నాడు," అన్నాడు. అయన గొంతెత్తి తన నౌకర్లతో కుంతలను తీసుకురమ్మని కేకపెట్టాడు. కుంతల పెళ్ళికూతురిలాగా ముస్తాబై లోపలికి వచ్చింది. ఆమె ముఖాన ఉండిన చిరునవ్వు అగ్నిమిత్రుణ్ణి చూడగానే మాయమయింది. "ఆ మనిషి ఈయన కాదు!" అన్నదామె.

"చాలా అబద్ధాలాడావు. నీ అబద్ధాలకు లక్ష్యపెట్టను!" అంటూ కాళీవర్మ మనమరాలిపైన గుడ్లు ఉరిమాడు.

"నేనీ మనిషిని ఎన్నడూ చూడలేదు. ఈయన నాతో ఎన్నడూ మాట్లాడలేదు," అన్నది కుంతల ఆందోళనతో.

"ఎవరైతే నాకేమిటి. ఈ పెళ్లి జరిగి తీరవలిసిందే. నీకు పెళ్లి చేసే భారం ఈ విధంగా వదిలించుకోవలిసి వచ్చింది. ఆ తప్పు నీదే. అందుచేత నీవు ఏమి చెప్పినా నేను వినను. ముహూర్తం తెల్లవారు ఝాముదాకా లేదు. ఈ లోపల మీరిద్దరూ సంప్రతించుకుని పెళ్లికి సుముఖులు కండి....ఇదుగో, అగ్నిమిత్రుడా! నీవు తప్పించుకుని పారిపోదలిస్తే నీ ప్రాణాలు దక్కవని తెలుసుకో. ఈ దక్షిణపు కిటికీలో నుంచి దూకితే అరవై నిలువుల లోతున లోయలో పడిపోతావు. ఈ వాకిలికుండా వెళితే నూరు కత్తులు నీ రక్తం చవి చూస్తాయి!" అంటూ కాళీవర్మ అక్కడి నుంచి వెళ్లిపోయాడు.

తరవాత అగ్నిమిత్రుడు కుంతలకేసి తిరిగి, "నాకిదంతా అయోమయంగా




ఉన్నది. నాకు అసలు సంగతి ఏమిటో చెప్పు!" అన్నాడు.

కుంతల దాచకుండా అంతా చెప్పింది. చివరకు అతను, "ఒకరిని పెళ్ళాడగోరిన మనిషి ఇంకొకరిని పెళ్లాడటంకంటె క్రూర మైన విషయం మరొకటి ఉండదు. నీకు అలాటి స్థితి కలగకుండా నా ప్రాణం అడ్డేస్తాను. భయపడకు!" అన్నాడు.

కుంతల ఆపుకోరానంత దుఃఖంతో, "నాకోసం మీరు ప్రాణాలు పోగొట్టుకోకండి. నన్ను పెళ్లాడటం మీకు రోత అనిపించక పోతే ఈ పెళ్లికి ఒప్పుకోండి!" అన్నది.

"రోతా! ఇలాటి బలవంతపు పెళ్లి కాక పోతే నేను ఎగిరి గంతేసి ఉందును. నీవంటి అందగత్తెను నేను కలలోకూడా చూడ లేదు. ఎంతో మంచి హృదయం కలదాని విగా కూడా కనిపిస్తున్నావు!" అన్నాడు అగ్నిమిత్రుడు.

"అయితే పెళ్లికి ఒప్పేసుకోండి. మీరు చచ్చిపోతే నేను జీవితమంతా కుంగి పోతాను!" అన్నది కుంతల.

"అది ఎంతమాత్రమూ వీలులేదు! నేను ఎవరనుకున్నావు? మహాయోధుణ్ణి! చావుకు లక్ష్యపెడతా ననుకున్నావా? నాపైన జాలి పడి ఎలాగైనా చావు రాకుండా ఉండటానికే నువు నీ ప్రేమను బలిచేసి నన్ను పెళ్లాడతా నంటున్నావు. నేను చచ్చిపోతే తప్ప నువు నిజంగా ప్రేమించినవాణ్ణి పెళ్ళాడలేవు. అందుచేత నేను చావటానికే నిశ్చయిం చాను!" అన్నాడు అగ్నిమిత్రుడు.

"అలా అయితే నిజం చెబుతున్నాను వినండి. నేను ఆ మనిషిని ప్రేమించలేదు. మనస్ఫూర్తిగా మిమ్మల్నే ప్రేమిస్తున్నాను. మనకు పెళ్ళి కాకపోయినా నేనింకొకరిని పెళ్ళాడటం కల్ల!" అన్నది కుంతల.

ముహూర్తానికి ముందుగా కాళీవర్మ వచ్చి, "ఏం, పెళ్లికి ఇద్దరూ ఒప్పుకుంటు న్నారా, లేదా?" అన్నాడు.

"నేను సిద్ధమే!" అన్నాడు అగ్ని మిత్రుడు.

కుంతల సిగ్గుపడ్డట్టు తల వంచుకున్నది.

వారిద్దరికీ వివాహం జరిగింది. అగ్ని మిత్రుడికి రాజుగారి వద్ద పెద్ద ఉద్యోగం కూడా దొరికింది.

బేతాళుడీకథ చెప్పి, "రాజా, మొట్ట మొదట ఈ బలవంతపు పెళ్లికి ఒప్పుకోని అగ్నిమిత్రుడూ, కుంతలా చివరకు ఎలా ఒప్పుకున్నారు? కాళీవర్మకు భయపడేనా? వారిద్దరిలో ఎవరిని ఎవరు మోసంచేశారు? ఈ అనుమానాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కాళీవర్మ భయం కుంతలకూ లేదు, అగ్నిమిత్రుడికీ లేదు. అగ్నిమిత్రుడు నిజమైన క్షత్రియ యోధుడు. అతను బలవంతపు పెళ్ళికి ఒప్పుకునేకన్న చావటానికైనా సిద్ధపడతాడు. కుంతలకు తన తాత చంపేస్తాడన్న భయం ఎప్పుడూ లేదు. వారిద్దరూ మనస్ఫూర్తిగానే పెళ్ళాడారు; ఒకరినొకరు వంచించుకోవటం జరగలేదు. ఏక్షణాన అగ్నిమిత్రుడు తనను బలవంతాన పెళ్ళాడేకన్న చావటమే మేలని నిశ్చయించాడో ఆ క్షణంనుంచీ ఆమె అతన్ని నిజంగానే ప్రేమించింది. ఎవడో యువకుడు తనతో మాట్లాడతానంటేనే ఎంతో కృతజ్ఞత తెచ్చుకున్న మనిషి, తనకోసం ప్రాణాలర్పించేవాణ్ణి ప్రేమించటంలో ఆశ్చర్యం ఏమున్నది? కుంతల అగ్నిమిత్రుణ్ణి ప్రేమించటం ప్రారంభించినాకా, ఆమె తనను నిజంగా ప్రేమిస్తున్నదని అగ్నిమిత్రుడు తెలుసుకున్నాకా వారిద్దరిమధ్యా జరిగే పెళ్ళి బలవంతపు పెళ్ళి కాకుండా పోయింది!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# జంట అద్దాలు

పన్నెండవ శతాబ్దంలో ఉత్తర చీనాను తాతార్లు కొల్లగొట్టి, కరువులూ కాటకాలూ కలిగించారు. కాని ఆ కాలంలో దక్షిణ చైనా, అందులో ముఖ్యంగా తూర్పు ప్రాంతం, చాలా సుభిక్షంగా ఉంది. ఆ ప్రాంతంలో వున్న పూచౌనగరానికి ఫెంగ్ చుంగ్యీ అనేవాణ్ణి తాశిల్దారుగా నియమించారు. ఆయన ఉత్తరదేశంవాడు గనక పూచౌనగరంలో మరింత క్షేమంగా వుంటుందని వెంటనే బయలుదేరి చియెంచౌదాకా వచ్చి చేరాడు.

అప్పటికి ఈశాన్య చైనాలో కాటకం బయలుదేరింది. చియెంచౌలో దుర్భరమైన కరువున్నది. ధాన్యంగింజలు కళ్లబడక జనం మాడిపోతున్నారు. ఒకమూల యుద్ధం జరుగుతూండటంవల్ల అధికార్లు పన్నుల కోసం ప్రజలను పీడిస్తున్నారు. వీరి బాధ పడలేక ప్రజలు చుట్టుపక్కల కొండలలోకి పారిపోయి పితూరీదార్లు కాసాగారు. పాము కదలాలంటే, ముందు తల కదలాలి. వారికి ఫాన్ జువే నాయకుడయాడు.

ఫాన్ ధైర్యసాహసాలు కలవాడు. అభాగ్య ప్రజానీకాన్ని రక్షింతా మనుకున్నాడు. అందుకని అందరూ అతనిచుట్టూ మూగారు. త్వరలోనే పితూరీదార్ల సంఖ్య లక్షకు చేరబడింది. వాళ్ళు రాత్రివేళ ధనికుల ఇళ్లపై బడి, వారిని హతమార్చి, వారి ఇళ్ళు తగలబెట్టేవారు. అక్కడ దొరికిన ధనాన్నీ, ఆహార పదార్థాలనూ సమంగా పంచుకునేవారు. లేనప్పుడు అందరూ మాడేవారు.

ప్రభుత్వ బలాలు పితూరీదార్ల చేతిలో ఎన్నోసార్లు అపజయాలు పొందాయి. చివరకు ఫాన్ చియెంచౌను ఆక్రమించాడు. 'నాయకుడు ఫాన్' అని పేరు పెట్టుకున్నాడు. చుట్టుపట్ల ప్రాంతాలను కొల్లగొట్టమని తన మనుషులను పంపాడు. తన వంశంవారి



కందరికీ పెద్దపెద్ద హోదాలిచ్చి సైనికోద్యోగులను చేశాడు.

ఫాన్ వంశానికి చెందినవారిలో ఫాన్ షిచౌ అనే యువకు డొకడుండేవాడు. అతని వయస్సు ఇరవైమూడేళ్ళు. అతను ఈతలో ఘటికుడు. నాలుగైదు రోజులు వరసగా నీటిలో వుండగలిగేవాడు. అందుకని అతణ్ణి నీటిపాము అని పిలిచేవాళ్ళు. ఫాన్ వంశానికి చెందినవాళ్ళు పితూరీదార్లతో చేరకపోతే తల తీసేస్తామని ప్రకటించటంవల్ల అతను, ఇష్టం లేకుండానే, పితూరీదార్లతో చేరాడు. అయితే అతను దిక్కులేనివారికి సహాయ పడేవాడే తప్ప, కొల్లగొట్టటానికి వెళ్ళేవాడు కాడు. అతను పిరికివాడనే నమ్మకంతో పితూరీదార్లు అతన్ని గుడ్డి నీటిపాము అని పిలిచి గేలి చేయసాగారు.

ఇది ఇలా వుండగా, ఫూచౌకు పోతూ తన భార్యతోనూ, యుమే అనే పదహారేళ్ళ కుమార్తెతోనూ తాశిల్దారు ఫెంగ్, చియెంచౌ నగరం చేరేసరికి పితూరీదార్లు వారిపై బడి, వారికున్నదంతా కొల్లగొట్టారు. ఆ భీభత్సంలో యుమే ఎటో తప్పిపోయింది. ఆమె తండ్రి ఆమెకోసం వెతికి, వెతికి, ప్రాణం విసిగి పుట్టెడు దుఃఖంతో తన ప్రయాణం సాగించాడు.

యుమే, పారిపోయే శక్తి లేనందున పితూరీదార్ల చేత పడి దుఃఖించ సాగింది. ఈ స్థితిలో ఫాన్ షిచౌ ఆమెను చూసి, జాలిపడి, పలకరించాడు. ఆమె ఒక అధికారి కూతురని తెలియగానే, ఆమె కట్లు విప్పించి, ఆమెను తన ఇంటికి తీసుకుపోయి మంచిమాటలతో ఊరడించాడు.

"నేను తిరుగుబాటుదారును కాను. మా వంశంవాళ్ళ ఒత్తిడిచేత యిక్కడ వున్నాను. తిరిగి ప్రభుత్వం ఇక్కడికి వస్తే నేను లొంగిపోయి మామూలు పౌరుడులాగా జీవిస్తాను. నన్ను మీరు పెళ్లాడటానికి సమ్మతిస్తే నాకన్న అదృష్టవంతు డుండ

పోడు," అని ఫాన్ షిచౌ యుమేతో ఎంతో మృదువుగా చెప్పాడు.

అతన్ని వివాహమాడాలని లేకపోయినా, వారి చేతుల్లో చిక్కివున్న యుమేకు సరే ననక తప్పలేదు. ఈ విషయం విని నాయకుడు ఫాన్‌కూడా సంతోషించాడు. పెళ్ళికి ముందు వరుడు వధువుకు అనేక బహుమతులు కొనియిచ్చాడు. వాటిలో ఒక జంట అద్దాలున్నాయి. ఒకదానిమీద 'మగబాతు' అనీ రెండోదానిమీద 'ఆడబాతు' అనీ రాసివుంది. వాళ్ళిద్దరికీ వైభవంగా పెళ్ళి అయింది. ఫాన్ వంశస్థులంతా పెళ్ళికి వచ్చారు. వారిద్దరి దాంపత్యం ఎంతో సుఖంగా, ఆదర్శప్రాయంగా జరగసాగింది.

మట్టికుండ పగలక మానదు. ప్రభుత్వం తాతార్లను జయించిన అనంతరం దేశంలో సుస్థిర పరిస్థితి ఏర్పడగానే ప్రభుత్వ సైన్యాలు పితూరీదార్లపై ప్రయోగించబడ్డాయి. లక్షమంది సైనికులతో రాజకుమారుడు హాన్ షీచుంగ్ పితూరీదార్లపై హఠాత్తుగావచ్చి పడ్డాడు. చియెంచో నగరం ముట్టడించబడింది.

హాన్ రాజకుమారుడు ఉత్తరదేశంలోనే తాశిల్దారు ఫెంగ్‌ను యెరుగును. ఫూచోలో ఉండే ఫెంగ్ ఈ దేశం బాగా




ఎరుగును గనక హాన్ తన సేన వెంట ఫెంగ్‌నుకూడా అధికారిగా తెచ్చాడు.

గోడల లోపల నగరంలో నానా భీభత్సంగా వుంది. నాయకుడు ఫెంగ్, ముట్టడి సేనలను ఏమరిచి పారిపోదామని చాలా యత్నాలు చేశాడుగాని అవి ఫలించలేదు. పరిస్థితి తీవ్రంగా వుండటం గమనించి యుమే తన భర్తతో, "స్వామీ, ప్రభుత్వ సేనలు నగరాన్ని ఏ క్షణాన అయినా పట్టుకోవచ్చు. పితూరీదార్లలో చేరిన మిమ్మల్ని వదిలిపెట్టరు. నా కళ్ళ ఎదట మిమ్మల్ని ఉరితీస్తే నేను భరించలేను. నేను ముందే ఆత్మహత్య చేసుకుంటాను.

ఆనాడు పితూరీదార్లు నన్ను పట్టుకున్నప్పుడు మీరు రక్షించకపోతే అప్పుడే ఆత్మహత్య చేసుకుని ఉండేదాన్ని," అన్నది.

ఈ మాట అంటూనే ఆమె కత్తి తీసి పొడుచుకోబోయింది. ఫాన్ ఆమె ప్రయత్నాన్ని వెంట్రుకవాసిలో భగ్నంచేసి, "నేను కావాలని పితూరీదార్లలో చేరలేదు. కాని ఆ విషయం ఎవరు ఆలోచించబోతారు? నాకు చావు రాసిపెట్టే వుంది. కాని నీకు చావవలసిన గతేమిటి? నీ తండ్రి అధికారి. హాన్ రాజకుమారుడూ, అతని అనుచరులూ నీలాగ ఉత్తరదేశం నుంచి వచ్చినవారు. మీ భాషే మాట్లాడతారు. ఎవరో ఒకరు నీ వార్త మీ తండ్రికి అందించకపోరు. ప్రాణం విలువైనది. దాన్నెందుకు వృధాగా వదిలేస్తావు?" అన్నాడు.

"చావు తప్పినా నేను తిరిగి పెళ్ళి చేసుకోను. సైనికులు నన్ను పట్టుకుంటే మానం పోగొట్టుకునేకన్న ప్రాణమే పోగొట్టుకుంటాను," అన్నదామె.

"ఏ దేవుడన్నా అడ్డుపడి నేను ప్రాణాలతో బయటపడితే జన్మలో మరెవతెనూ పెళ్ళాడనని ప్రమాణం చేస్తున్నాను," అన్నాడు ఫాన్.

"మీరు నాకు జంట అద్దాలు బహుమతి ఇచ్చారు. అవి చెరొకటీ తీసుకుని దగ్గిర



ఉంచుకుందాం. అవి తిరిగి కలిస్తే మనం మళ్ళీ కలిసినట్టే," అన్నది యుమే.

ఇది జరిగిన మరుసటి మాసమే హాన్ సేనలు చియెంచో నగరం ప్రవేశించాయి. నాయకుడు ఫాన్ తన కార్యాలయానికి చిచ్చుపెట్టి ఆ మంటలలోనే మసి అయిపోయాడు, పితూరీదార్లందరూ హాన్‌కు లొంగిపోయారు. ఫాన్ వంశస్థులకు మాత్రమే మరణదండన విధించి, ఇతరులను విడిచిపెట్టారు. మరణశిక్ష ఇవ్వటానికిగాను యుద్ధంలో చావగా మిగిలిన ఫాన్ వంశస్థులను పట్టుకుపోగానే యుమే, తన భర్త జీవితం ముగిసిందని రూఢి చేసుకుని, ఒక ఖాళీ ఇల్లు ప్రవేశించి, దాని దూలానికి ఉరిపోసుకుని వేళ్ళాడింది.

అయితే యుమేకింకా ఆయుర్దాయం ఉంది. మరి కొద్దిసేపటికి ఆమె తండ్రి కొందరు సైనికులతో ఆ యింటిమీదుగా పోతూ, లోపల ఎవరో స్త్రీ వేలాడుతూ వుండటం చూసి, ఆమెను కిందికి దింపించాడు. కాని ఆమెకు స్పృహ రావటానికి చాలాకాలం పట్టింది. ఏమైతేనేం, తండ్రీ కూతుళ్ళు తిరిగి కలుసుకుని ఆనంద బాష్పాలు రాల్చారు. ఆమె తన తండ్రితో, ఫాన్ తనను ఏవిధంగా పితూరీదార్లవద్ద నుండి రక్షించినదీ, ఎట్లా తమకు వివాహ





మయింది వివరంగా చెప్పింది. అంతా విని ఫెంగ్ ఏమీ అనలేదు.

పితూరీదార్ల పరాజయం పూర్తిచేసి హాన్ రాజకుమారుడు, తన సర్దార్లతో, ఫెంగ్‌తో రాజధానికి తిరిగి వెళ్ళాడు.

ఒకనాడు ఫెంగ్ తన భార్యతో తమ కుమార్తె భవిష్యత్తు గురించి మాట్లాడాడు. ఆమె ఇంకా పసిపిల్ల. అందుచేత ఆమెను మళ్ళీ పెళ్లికి ఒప్పించాలని భార్యాభర్తలు నిశ్చయించారు. కాని యుమే దీనికి యెంత మాత్రం ఒప్పలేదు.

"పరిస్థితుల ప్రోద్బలంవల్ల నువ్వతన్ని పెళ్ళాడావు. అతనా చచ్చిపోయాడు. నువు స్వతంత్రురాలివి. ఇంకా అతని ప్రసక్తి దేనికి?" అన్నాడు తండ్రి.

"నా భర్త బుద్ధిపూర్వకంగా పితూరీదార్లలో చేరలేదు. ఆయన ఒకరికి చాతనయిన సహాయం చేశాడేగాని, ఎన్నడూ ఒక్క చెడ్డపని చేసి యెరగడు. నేను బౌద్ధ సన్యాసినిగా ఉండి మీకు సేవ చేస్తాను. నాకు మళ్లీ పెళ్లి చెయ్యాలని మీకంత పట్టుదలగా ఉంటే ఆత్మహత్య అయినా చేసుకోనివ్వండి," అన్నది యుమే, కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ.

ఆమె ఇలా అన్నాక తలిదండ్రులు ఒత్తిడి చేయలేకపోయారు.

కాలం బాణంలాగా పరిగెత్తింది. పన్నెండేళ్ళు గడిచాయి. ఈలోగా ఫెంగ్, ఫెంగ్చో నగరంలోని సైనిక శిబిరానికి ఉప నాయకుడయాడు. ఒకనాడు క్వాంగ్‌చో నగరం నుంచి అక్కడి ఉపసేనానాయకుడు హెూ చెంగ్షిన్ అనేవాడు ఫెంగ్‌ను చూడవచ్చి సైనిక విషయాలు చాలా సేపు మాట్లాడి వెళ్ళాడు.

వెనక గదిలోనుంచి తొంగి చూసిన యుమే, తన తండ్రి లోపలికి రాగానే, "ఆయనెవరు, నాన్నా?...చిత్రం. ఆయన మాట నా భర్త మాటలాగే ఉంది!" అన్నది.

"చియెంచో పతనమైనప్పుడు ఫాన్ వంశస్థులందరూ నిర్మూలించబడ్డారు. ఇతని పేరు హెూ. ప్రభుత్వాధికారి. నీ ఊహ వెర్రితలలు వేస్తోంది. ఇలా పనివాళ్ళదగ్గిర మాట్లాడితే వాళ్ళు నిన్ను చూసి నవ్వ గలరు!" అన్నాడు తండ్రి. యుమే చచ్చే సిగ్గుపడి మరేమీ అనలేకపోయింది.

మరో ఆరు మాసాలకు హెూ చెంగ్షిన్ మళ్ళీ ఏదో వార్త తీసుకుని ఫెంగ్ వద్దకు వచ్చాడు. ఈసారికూడా అతనిలో యుమే తన భర్త పోలికలు స్పష్టంగా గమనించి నివ్వెరపోయింది. ఆమె తన తండ్రితో ఈ విధంగా అన్నది:

"నేను ఇహసుఖాలు త్యజించిన సన్యాసినిని. భ్రమలకు లోనై మాట్లాడు తున్నాననుకోవద్దు. క్వాంగ్చౌనుంచి వచ్చిన మనిషి మూడుమూర్తులా నా భర్తే. ఆయ నను భోజనానికి పిలిచి అడిగి చూడరాదా? నా భర్తను నీటిపాము అని వేళాకోళానికి పిలిచేవారు. మా ఇద్దరిదగ్గిరా జంట అద్దా లున్నాయి. వీటినిబట్టి ఆయనను తేలికగా పోల్చవచ్చు."

తండ్రి ఇందుకు సమ్మతించాడు.

మర్నాడు హెూను విందుకు పిలిచారు. ఫెంగ్, హెూలిద్దరూ ఏకాంతంగా మాట్లాడు తున్నప్పుడు ఫెంగ్, "మీకు నీటిపామనే



పేరున్నదిగదా? మీ సంగతంతా నేనెరుగుదును. మీరు నాతో స్వేచ్ఛగా మాట్లాడవచ్చు!" అన్నాడు.

హెూ వెంటనే ఆయన కాళ్ళమీద పడి, "నన్ను కనికరించండి!" అన్నాడు. తరవాత అతను ఫెంగ్‌తో తన కథ యావత్తూ చెప్పాడు. ఫాన్ వంశస్థులకు ఉరిశిక్షలు విధించినప్పుడు, ఇతను మంచివాడని తెలిసి ఎవరో రక్షించారు. తరవాత అతను తన పేరు మార్చుకుని, సైన్యంలో చేరి తన పరాక్రమంచేత ఉపసేనానాయకుడి హెూదా సంపాదించాడు.

"నీ భార్య పేరేమిటి? అసలు నీకెందరు భార్యలు?" అని ఫెంగ్ అడిగాడు.

"పితూరీదార్ల వెంట ఉన్నప్పు డొక అధికారి కుమార్తెను రక్షించి ఆమెను పెళ్ళాడాను. ఒక సంవత్సరం గడిచాక, నగరం పతనమైనప్పుడు, మేము చెరొక దారీ అయాము. కాని ఇద్దరమూకూడా తిరిగి పెళ్ళాడమని శపథం చేసుకున్నాం. నేను మళ్లీ పెళ్ళాడలేదు," అన్నాడు హెూ.

"మీరు దేనిమీద ప్రమాణాలు చేసుకున్నారు?" అని ఫెంగ్ అడిగాడు.

"మా దగ్గిర ఆడ మగ బాతుల జంట అద్దం ఉండేది. అందులో చెరొకటీ మేము తీసుకుని ప్రమాణం చేసుకున్నాం. నా అద్దం ఇదుగో. దీన్ని ఎప్పుడూ వెంటనే ఉంచుకుంటాను," అంటూ హెూ తనవంతు అద్దం పైకి తీశాడు. ఫెంగ్ జేబులోనుంచి రెండవ అద్దం తీసి దానికి తగిలించాడు. యుమే అనాడు అన్నట్టే ఆ అద్దాలు ఒకదానికొకటి చేరుకోగానే, విడిపోయిన భార్యా భర్తలు తిరిగి కలుసుకున్నారు. తన కూతురూ, అల్లుడూ తిరిగి కలుసుకున్నందుకు ఫెంగ్ పెద్ద విందు చేశాడు.

వారి తదనంతరం ఆ జంట అద్దం వారి వంశంలో చాలా తరాలవరకూ భద్రంగా ఉంచబడింది.





# చందమామ ఆత్మకథ

నేను ఎవర్ని? ఎప్పుడు పుట్టాను? ఎవరికి పుట్టాను? ఇవేవీ నాకు తెలియదు.

బుద్ధి తెలిసినప్పటినుంచి నేను ఆకాశంలో ఒంటరిగా ఉన్నాను. నేనున్న చోటికి ఆకాశం భలే అందంగా కనబడుతుంది. అది కారునలుపు రంగులో ఉంటుంది. దానినిండా ధగధగా వెలిగే నక్షత్రాలు. సూర్యుడు ఆ ఆకాశంలో మెల్లిగా తిరుగుతూన్నట్టు కనిపిస్తాడు. సూర్యుడిలో చెలరేగే మంటల తుఫానులూ, సూర్యుడిపైనుంచి ఆకాశంలోకి లేచే అఖండమైన జ్వాలలూ నాకు కనిపిస్తూనే ఉంటాయి.

ఆకాశంలో సూర్యుడు కదులుతాడు, నక్షత్రాలూ కదులుతాయి. గ్రహాలూ కదులుతాయి. ఇంచుమించు కదలకుండా నా ఎదట అస్తమానం నిలిచి ఉండేది భూమే. సూర్యుడు నాకెదురుగా ఉన్నప్పుడు భూమి దాదాపు కనిపించదు. సూర్యుడు నాకు కనపడకుండా పోయిన అనంతరం భూమి కొంచెం కొంచెమే ప్రకాశించ నారంభిస్తుంది. మీకు తెలుసా? సూర్యుడు అస్తమించినది లగాయతు తిరిగి ఉదయించేదాకా నాకు రాత్రి. సరిగా అర్ధరాత్రి అయేసరికి భూమి గుండ్రంగా, కాంతితో వెలిగిపోతూ ఉంటుంది. సూర్యోదయం కావచ్చేసమయానికి భూమిలో సగం భాగం చీకటి అయిపోతుంది. సూర్యుడు ఉదయించినది మొదలు అస్తమించేదాకా నాకు పగలు. మిట్టమధ్యాన్నం వేళకు నాకు భూమి కనిపించకుండా పోతుంది.

సరిగా ఈ మిట్టమధ్యాన్నంవేళ ఒక్కొక్కసారి భూమిని నేను చూడగలుగుతాను! ఎలాగో తెలుసా? సూర్యుడు భూమిచాటుకు పోతాడు. అలాగే ఒక్కొక్కసారి అర్ధరాత్రివేళ నా ఎదట ప్రకాశించే భూమి కాస్తా మసకబారిపోయి నాకు భయం వేస్తుంది. అప్పుడేం జరుగుతుందో తెలుసా? భూమిమీద సూర్యకాంతి పడకుండా నేనే అడ్డొస్తాను. అంటే, భూమి నా నీడలోకి వస్తుందన్నమాట. అయితేనేం? కొంచెంసేపయాక నా నీడ పక్కకి తప్పుకుని భూమి ఎప్పటిలాగే మళ్లీ వెలుగుతుంది.

## 2

ఒకసారి నా దగ్గిరికి కొందరు మునీశ్వరులు వచ్చారు. వాళ్ళకి నేను నమస్కారం చేసి, "మహనీయులారా! నేను ఎవణ్ణి? ఎప్పుడు పుట్టాను? ఎవరికి పుట్టాను?" అని అడిగాను.

వాళ్ళు నాకు నా జన్మవృత్తాంతం ఇలా చెప్పారు:

పూర్వం దేవతలూ దానవులూ కలిసి అమృతంకోసం క్షీరసాగరాన్ని మథించారట. క్షీరసాగరాన్ని మథించాలంటే ఎంత పెద్ద



కవ్వం కావాలి, ఎంత పెద్ద తాడు కావాలి! అందుచేత మందర పర్వతాన్ని కవ్వంచేసి, వాసుకి అనే సర్పరాజును తాడుగా చేసి క్షీరసాగరాన్ని మథించారట. ముందుగా హాలాహలం వచ్చి ప్రపంచాన్ని దహించేస్తుంటే, ప్రాణికోటిని రక్షించటానికి పరమేశ్వరుడు వచ్చి దానిని కాస్తా దిగమింగి తన కంఠంలో దాచాడట.

ఆ తరవాత పాలసముద్రంనుంచి లక్ష్మీదేవి, నేనూ, ఇంద్రుడి వాహనమైన ఐరావతమూ, చివరకు అమృతమూ పుట్టామట!

"కనుక, నాయనా, నీవు క్షీరసాగర మథనమప్పుడు భూదేవి కడుపున పుట్టావు. అమృతం నీకు తోబుట్టువు గనకనే నిన్ను చూడగానే భూమిపై గల అన్ని జీవులకూ కొత్త జీవం వచ్చినట్టుగా ఉంటుంది!" అని మునులు నాతో చెప్పారు.

వాళ్లు నా చిన్నప్పటి కథలుకూడా కొన్ని చెప్పారు:

క్షీరసాగరం నుంచి అమృతం వెలువడగానే దానికోసం దేవతలూ, రాక్షసులూ కలియబడ్డారట. అప్పుడు, దేవతలంటే అభిమానం గల విష్ణుమూర్తి మోహినీరూపం ధరించి, దేవతలను ఒక పంక్తిగానూ, రాక్షసులందరినీ ఒక పంక్తిగానూ కూచోబెట్టి దేవతలతో ప్రారంభించి ఒక్కొక్కరికే అమృతం పోయసాగాడట. ఆ అమృతం తమదాకా రాదని తెలుసుకుని రాహువనే రాక్షసుడు చల్లగా వచ్చి దేవతల పంక్తిలో కూచున్నాడట. ఈ మోసం గ్రహించక విష్ణువు వాడికి



కూడా అమృతం పోసేస్తుంటే నేను పక్కనే ఉండి కన్ను మలిపానుట. వెంటనే విష్ణువు తన చక్రాయుధాన్ని పిలిపించి, అమృతం రాహువు కఠం దిగేలోపల వాడి తల కాస్తా పడేటట్టు చేశాడు. రాహువు చచ్చిపోయినా అమృతం తాగిన వాడి శిరస్సు చావక బతికి ఉండి, నేను తనకు ద్రోహం చేశానన్న కోపంతో అప్పుడప్పుడూ నన్ను మింగేస్తుందట. అప్పుడు మా అమ్మకు నేను కన పడనట!

అయితే నేనీ రాహువును ఎన్నడూ చూడ లేదు. నన్ను రాహువు మింగిందని నా అల్లుళ్ళూ, కోడళ్ళూ అయిన మీరంతా అను కునే సమయంలో నాకు మిట్టమధ్యాన్నం వేళ సూర్యుడు కనపడకుండా పోతాడు. అంతే తప్ప మరేమీ లేదు....

అయినా మునీశ్వరులు చెప్పినది కొట్టి పారెయ్యటం నాకు ఇష్టంలేదు. భూమి నాకు నిజంగా అమ్మే అయి ఉండాలి. లేకపోతే ఎప్పుడూ నా ఎదటే ఎందుకుంటుందీ?

మా అమ్మ ఎప్పుడూ నా ఎదట ఉండ టమే కాదు, తనను అన్నివైపులనుంచి నన్ను చూడనిస్తుంది. నేనుమాత్రం మా అమ్మకేసి తిరిగి ఉంటాను—ఎన్నడూ నా వీపు ఆవిడకేసి తిప్పను... మా అమ్మ ఎప్పుడూ తన సముద్రపు కెరటాల చేతు లను నాకేసి చాస్తుంది!...

నన్నుగురించి ఇంకొక కథ:

ఒకనాడు విఘ్నేశ్వరుడు జాస్తిగా భోజనం చేసి తన తండ్రి అయిన పరమేశ్వ రుడివద్దకు వెళుతున్నాట్ట. భుక్తాయాసంతో అతను అడుగు తీసి అడుగు వెయ్యలేకుండా ఉండటం చూసి నేను నవ్వానుట. దాంతో విఘ్నేశ్వరుడికి పట్టరాని కోపం వచ్చేసి,



కడుపు కాస్తా పగిలి, తిన్నదంతా బయటికి వచ్చేసిందట. తరవాత విఘ్నేశ్వరుడి పొట్టను పాములతో కుట్టేశారట. తన ముద్దుల కొడుకును చూసి నేను అపహాస్యం చేశానని పార్వతిదేవి నన్ను శపించిందట. శాపం ఏమిటంటే—నన్ను చూసినవారు అపనిందల పాలౌతారని!

ఇది విని దేవతలంతా నాకోసం ఆందోళన పడి, పార్వతిదేవిని వేడుకుని, ఒక్క వినాయకచవితి రోజున మట్టుకే నామీద





ఆ శాపం పనిచేసేలాగ ఏర్పాటుచేశారట. వినాయక చవితినాడు నన్ను చూడబట్టే కృష్ణుడు శ్యమంతకమణి కాజేశాడన్న అపకీర్తి అనుభవించాడట! ఆ కథ ఏమంటే—

సత్రాజిత్తు అనేవాడు సూర్యుణ్ణి ప్రార్థించి, రోజుకు పది బారువుల బంగారం ఇచ్చే శ్యమంతకమణిని తెచ్చుకున్నాడు. ఆ మణిని తన కివ్వమని కృష్ణుడు ఒకప్పుడు అడగగా సత్రాజిత్తు ఇచ్చేది లేదన్నాడు. తరవాత కొంత కాలానికి సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడనేవాడు ఆ మణిని తీసుకుని వేటకు వెళ్లాడు. అప్పుడొక సింహం ప్రసేనుణ్ణి చంపి ఆ మణిని ఎత్తుకుపోయింది. తరవాత జాంబవంతుడా సింహాన్ని చంపి శ్యమంతకమణిని తీసుకుపోయి తన కూతురు జాంబవతికి ఇచ్చాడు.

అయితే కృష్ణుడే ప్రసేనుణ్ణి చంపి శ్యమంతకమణి కాజేశాడని అపవాదు పుట్టింది. ఏ పాపమూ ఎరగని కృష్ణుడు ఈ అపవాదునుంచి తప్పించుకునేటందుకు "డిటెక్టివు"లాగా పని చేశాడు. ప్రసేనుడు చచ్చిపడిఉన్న చోటినుంచి సింహం జాడలు



కనిపించాయి. వాటినిబట్టి పోగా చచ్చిన సింహం కనబడింది. అక్కడినుంచి జాంబవంతుడి అడుగుజాడలు కనబడి నేరుగా జాంబవంతుడి గుహకు తీసుకుపోయాయి. కృష్ణుడు జాంబవంతుణ్ణి యుద్ధంలో ఓడించి జాంబవతినీ, శ్యమంతకమణినీకూడా తెచ్చుకున్నాడు; శ్యమంతకమణిని తెచ్చి సత్రాజిత్తు కిచ్చి అతడి కుమార్తెను సత్యభామనుకూడా పెళ్లాడాడు. అపవాదు పస్తేనేం? చక్కని చుక్కలు ఇద్దరు పెళ్లాలుగా దొరికారు!

### 3

నన్నుగురించి తెలుసుకోవాలని మీకు భలే సరదాకాదూ? నాకుకూడా మీకు చేసేపంతా సరదాగానే ఉంటుంది. ఎన్నివేల యేళ్లుగా మీరు నన్ను ఎన్నివిధాలుగా తలుచుకుంటున్నారో నాకు తెలుసు.

మీలో కవులు నన్ను ఎన్నో విధాలుగా వర్ణించారు; నన్ను పొగడారు; ఒక్కొక్కప్పుడు తిట్టారుకూడా! అయితేనేం? ఆ తిట్లలో కూడా నామీద ఎంతో అభిమానం ఇమిడి ఉన్నది.



నామీద ఎందరో ప్రమాణాలు చేశారు. అందమైన ఆడవాళ్ళ ముఖాలన్నిటినీ నాతో పోల్చారు! నా చల్లదనంకోసం తహతహలాడి పోయారు...ఎంతోమంది తమ పిల్లలకు నా పేరు పెట్టుకున్నారు. నా పేరిట రాజ వంశాలే పుట్టి, గిట్టాయి!

నన్నుగురించి ఎన్నిరకాల కథలు అల్లారో చెప్పలేను. నాలో ఉండే నల్లని మచ్చలను గురించికూడా రకరకాల కథలు సృష్టించారు. నన్నుచూస్తే కొందరికి రావిచెట్టూ, దానికింద రాట్నం పెట్టుకుని కూచుని ఏకులు వడికే ముసలమ్మా కనిపిస్తుంది! మరికొందరికి కుందేలు కనిపిస్తుంది— అందుకే నన్ను శశాంకుడనికూడా పిలుస్తారు!

అయితే నన్నుగురించి నిజం తెలుసుకోవటానికి ప్రయత్నించినవారు శాస్త్రజ్ఞులు. సిద్ధాంతులు ఏనాడో నా గమనాన్ని గుణించి, నన్నుబట్టి మాసాలు ఏర్పాటుచేశారు; నాపేర వారంలో ఒకరోజు ఏర్పాటుచేశారు. అది సోమవారం.

నిజానికి ఇతర గ్రహాలు నాకు పిన తల్లులూ, పెత్తల్లులూనూ; అయినప్పటికీ జ్యోతిష్కులు నన్ను ఒక గ్రహంకిందనే జమకట్టి, మీలో ఎవరైనా పుట్టగానే నేను ఏ నక్షత్రానికి సమీపంగా ఉన్నానో చూసి దానిని మీ జన్మనక్షత్రంగా భావిస్తారు.

ఎంతో శ్రమపడి శతాబ్దాలమీదట శాస్త్రవేత్తలు నన్ను గురించి చాలా వివరాలు సంపాదించారు. నా లావు 2,163 మైళ్ళుఅనీ, నా చుట్టుకొలత 6,795 మైళ్ళు అనీ, నేను మీకందరికీ రెండులక్షల మైళ్ళకు పైబడిన దూరంలో ఉన్నాననీ అంచనా కట్టారు.

వాళ్ళుకూడా కొన్నికొన్ని విషయాలను గురించి పొరపాట్లుపడి వాటిని దిద్దుకుంటున్నారు. ఒకప్పుడు వాళ్ళు నాలో నల్లనివన్నీ కొండలనీ, తెల్లగాఉన్న మేర అంతా సముద్రాలనీ అనుకోవటమే గాక ఆ సముద్రాలకు పేర్లుకూడా పెట్టారు.

పెద్దపెద్ద దుర్భిణుల సహాయంతో శాస్త్రవేత్తలు నన్ను పరిశీలించ నారంభించాక వారికి నాలో నీరన్నది లేదని తెలియ వచ్చింది. తరవాత వాళ్ళు నన్ను ఫొటోలు తీశారు. వాటిని మీరు చూసేఉంటారు.

అయితే శాస్త్రవేత్తలకు నాతో ఒక్క పెద్ద చిక్కు వచ్చిపడింది. నేను ఎప్పుడూ మా అమ్మకేసి వీపు పెట్టని కారణంచేత నా వీపు ఎలా ఉంటుందో తెలియక వాళ్లు మహా మథనపడిపోయారు. వాళ్లు ఈ సమస్య ఎలా పరిష్కరించుతారో చూస్తామని నేను కూడా ఎంతో ఆత్రంగా ఉన్నాను.

ఇంతలో ఒక విచిత్రమైన కొత్త ఉద్యమం బయలుదేరింది. దాన్నిగురించి కాస్త వివరంగా చెప్పాలి.

పురాణయుగంనాటి మనుషులకు బొందెతో కైలాసానికీ, స్వర్గానికీ వెళ్లాలన్న ఆసక్తి ఎంతగా ఉండేదో, ఈ కాలంలో నా దగ్గిరికి ఎలాగైనా ఎగిరి రావాలన్న గాఢ వాంఛ అనేకమందికి పట్టుకున్నది. అందని దాన్ని గురించి అతిగా కలలు కనటం స్వాభావికమేగద. అందుచేత కొందరు కల్పనాశక్తి గలవాళ్లు నాదగ్గిరికి మనుషులు ఏదోవిధంగా వచ్చి చేరినట్టుగా కథలు సృష్టించారు. ఆ కథలు చదివి ఎన్నో ఏళ్ళ తరబడి మనుషులందరూ ఎంతో ఆనందించారు.

ఇంతలో రాకెట్ ప్రయోగశాస్త్రం అభివృద్ధి చెందింది. శాస్త్రవేత్తలు 1957లో మొదటిసారిగా ఒక కృత్రిమ ఉపగ్రహాన్ని భూమిచుట్టూ తిరిగేలాగ ఏర్పాటుచేశారు. ఆనాటినుంచీ నా అల్లుళ్ళూ, కోడళ్ళూ నా దగ్గిరికి ఎప్పటికైనా వచ్చి తీరుతారనే ఆశ నాలో తలఎత్తింది!

ఒకదానివెంట ఒకటిగా కృత్రిమ ఉపగ్రహాలు—నాకు తమ్ముళ్ళలాటివి—మా



అమ్మచుట్టూ తిరగటం నా కంటపడింది. ఇంతలోనే ఒక దుడుకుపిండం నాకు అంత దూరంగా వెళ్లిపోయి సూర్యుడిచుట్టూ తిరగటానికి దారి చూసుకున్నది! నా ఆశ్చర్యం రెట్టింపయింది.

ఆ తరవాత ఒకదాని వెనక ఒకటిగా అద్భుతాలు జరిగాయి. ఒక తమ్ముడు మా అమ్మవద్దనుంచి ఒక పతకం కానుకగా తెచ్చి నాకు అర్పించాడు—నా అల్లుళ్ళు, కోడళ్ళు నాకు అందజేసిన మొట్టమొదటి కానుక!

దానికే నేను ఎంతో సంబరపడుతుంటే ఇంకో తమ్ముడు నాకేసి ఎగురుతూ వచ్చి, నా చుట్టూ ఒక ప్రదక్షిణం కొట్టి, నా వీపంతా ఫొటోలు ఎత్తి తిరిగి అమ్మకేసి వెళ్లిపోయాడు!... ఆ ఫొటోలు మీకు అందాయని విని సంతోషించాను.

నా ముఖంలో ఉండే వివరాలు నా వీపులో లేనందుకు కొందరు శాస్త్రవేత్తలు ఆశ్చర్యపడ్డారట. అది కేవలం పొరపాటు. ముఖంలో ఉండే వివరాలు వీపులో ఎందుకుంటాయా? కావలిస్తే మీ వీపులు చూసుకోండి!

## 4

ఈ కబుర్లన్నీ అటుంచి అసలు విషయానికి వస్తాను. సరిగా పదమూడేళ్ళక్రితం నాపేర పిల్లలకోసం ఒక పత్రిక ప్రారంభించారు. నన్ను మీకందరికీ సన్నిహితంగా చేసింది ఈ పత్రిక. అందుచేత ఈ పత్రిక పధ్నాలుగవ జన్మదిన సంచిక ద్వారా మీకందరికీ నా ఆత్మకథ చెప్పుకుందా మనిపించింది. చెప్పేశాను. మీలో చాలామంది రాకెట్లలో ఎక్కి నా దగ్గిరికి వచ్చెయ్యాలని కూడా ఉబలాటపడుతున్నారు, నాకు తెలుసు. తొందరపడకండి. మీరు నా దగ్గిరికి స్వేచ్ఛగా వచ్చి వెళ్ళే రోజు ఎంతో దూరంలో లేదు. ఆ రోజు దగ్గిరపడటానికి ఎంతోమంది శాస్త్రవేత్తలు తీవ్రంగా కృషిచేస్తున్నారు. అంతదాకా నా తరఫున "చందమామ" మిమ్మల్ని సంతోషపెడుతూ ఉంటుంది!



# చిట్టి బొమ్మ



"అమ్మా, నాకు ఆడుకునేటందుకు బొమ్మలు కావాలమ్మా!" అన్నది చిట్టి తన తల్లితో గారాంగా.

"ఈ పల్లెటూళ్లో కావాలన్నప్పుడల్లా బొమ్మలు ఎలా వస్తాయమ్మా! దీపావళికి అక్కా, బావ వచ్చేప్పుడు నీకోసం బొమ్మలు తెమ్మని రాద్దాంలే!" అన్నది అమ్మ.

"అందాకా నేనాడుకునేటందుకు బొమ్మ లేదా?" అన్నది చిట్టి.

చిట్టి హతాశురాలైపోయింది. వెంటనే తనుకూడా శామలలాగా ఒక బొమ్మను చంకన వేసుకుని ఊరంతా తిరిగి వస్తేగాని చిట్టికి ఆరాటం తగ్గేట్టు లేదు.

శామల షావుకారుగారమ్మాయి. చిట్టి కన్న చాలా పెద్దది. పన్నెండేళ్లుంటాయి. వాళ్ల నాన్న పట్నం వెళ్లి మూడు రోజుల కిందట తిరిగివస్తూ శామలకోసం అట్టపెట్టెలో పెట్టి పెద్దబొమ్మ—మూడేళ్ల పిల్ల అంతది—తెచ్చాడు. శామల ఆ బొమ్మను మొదటి రోజు ఎవరికీ చూపలేదు. రెండో రోజు తన కిష్టమైనవాళ్లను మాత్రమే పిలిచి రహస్యంగా చూపించింది. నిన్నటినుంచి శామల ఆ బొమ్మను చంకనేసుకుని అందరి ఇళ్లకూ తిరుగుతున్నది.



చిట్టికూడా ఆ బొమ్మను నిన్ననే చూసింది. మహా చక్కని బొమ్మ. మగబొమ్మ. దానికి నిజంగానే పొట్టలాగూ, కోటూ తొడిగి ఉన్నాయి. కాళ్లకి మేజోళ్లూ, బూట్లూ ఉన్నాయి. పెద్దపెద్ద కళ్లు నీకేసి ఆశ్చర్యంగా చూస్తున్నట్టుంటాయి! బొమ్మగాడు చిరునవ్వు నవ్వుతుంటే నోరు కొద్దిగా తెరుచుకుని లోపలి పళ్లు తెల్లగా కనిపిస్తాయి! బొమ్మగాడి బుగ్గలకు గులాబీ రెక్కలు అంటించినట్టుగా రోజారంగు పూశారు.

ఆ బొమ్మను చూసి పరమానందమయింది చిట్టికి. తాకి సంతోషించాలనుకుంటే శామల కసిరికొట్టింది; "మీ మట్టి చేతులతో ముట్టుకోకండి! బొమ్మ మాసిపోతుంది! కావలిస్తే, తాకకుండా ఎంతసేపైనా చూడండి." అన్నది.



కాని శామల చిట్టిని ఆ పనికూడా చెయ్యనివ్వలేదు. చిట్టి బొమ్మను చూస్తుండగానే, "ఇక నేను వెళ్ళాలమ్మా! పాపాయి అలిసిపోయాడు! తీసుకుపోయి బజ్జో పెట్టాలి!" అన్నది.

శామల బుద్ధులు చిట్టికి ఏనాడూ నచ్చవు. అయినా బొమ్మమీది ప్రేమకొద్దీ చిట్టి శామలను సహించింది. "శామలా, నీ పాపాయికి నేను జోల పాడనా?" అని బతిమాలుతున్నట్టుగా అడిగింది.

"నా పాపాయికి నువ్వెందుకు జోల పాడాలీ? నేనే పాడుకుంటా! నీకంతగా పాడుకోవాలనుంటే నీ బొమ్మకు నువు పాడుకో!" అన్నది శామల మొహం మాడ్చుకుంటూ.

చిట్టికి మండిపోయింది. శామలకు పాడటం ఏమీ చేతకాదు. పాడితే గాడిద అరిచినట్టుంటుంది. ఎవరినన్నా అడగండి, చిట్టి చక్కగా పాడుతుందంటారు. రాత్రి దీపాలు పెట్టినాక నాయనమ్మా చిట్టీ కలిసి రోజూ ఎన్నో పాటలు పాడుకుంటారు. అందుకనే చిట్టి శామల బొమ్మకు జోల పాడతానన్నది. అక్కర్లేకపోతే పోనీ! "నీ బొమ్మకు నువు పాడుకో!" అంటుంది శామల! తనకు బొమ్మ లేదని శామలకు తెలీనట్టు!

## 2

ఇంకా ఐదునెల్లు! అంతదాకా తనకు బొమ్మగీత లేదు! తలుచుకున్నకొద్దీ చిట్టికి దుఃఖం పొంగివచ్చింది. ఎంత అపుకున్నా ఆగలేదు.

"ఎందుకు, తల్లీ, ఒక్కతెవే కూచుని ఏడుస్తున్నావ్? అమ్మ కొట్టిందా?"

చిట్టి నాయనమ్మ గొంతు గుర్తించింది, కాని తల ఎత్తి మాట్లాడటానికి నామోషీ వచ్చింది. అయినా నాయనమ్మ వదలలేదు. చిట్టిని దగ్గిరికి తీసుకున్నది, చెంపలు తుడిచింది, చెక్కిళ్లు ముద్దుపెట్టుకున్నది, చిట్టి ఏడుపుకు కారణం తెలుసుకున్నది.

"ఓసి పిచ్చిపిల్లా! ఈమాత్రానికే ఏడుస్తారుటే? భలే మంచి బొమ్మలాట ఆడుకుందాం పద!" అంటూ నాయనమ్మ చిట్టిని దొడ్లోకి తీసుకుపోయింది.



నాయనమ్మను చూస్తూ చిట్టి తన దుఃఖం మరిచిపోయింది. నాయనమ్మ ఒక కొబ్బరి ఆకు కోసి, దాని మధ్యఈనె తీసి, రెండు పాయలతోనూ రెండు బొమ్మలు చేసింది. వాటిలో ఒకటి కొంచెం చిన్నది, ఒకటి పెద్దది. నాయనమ్మ రెంటికీ గుడ్డపీలికలు చుట్టింది. కల్యాణంబొట్లు పెట్టింది. ఇంకో కొబ్బ రాకుతో బూరా చేసి చిట్టని ఊదమన్నది. చిట్టికి ఈ ఆట కొంచెంకూడా బాగాలేదు. అయినా బూరా ఊదింది. కాని అది మోగ లేదు. చిట్టి ఆ బూరా విసిరికొట్టి, కొబ్బరాకు బొమ్మలను చేత్తో తోసి పారేసి పెద్దపెట్టున ఏడుపు ప్రారంభించింది.

సరిగా ఆ సమయానికి నాన్న వచ్చి, "ఎందుకమ్మా, చిట్టని ఏడిపిస్తున్నావూ?" అన్నాడు.

అమ్మ వంటింటోనుంచి తొంగిచూసి, "పొద్దుటినుంచీ చిట్టి ఒకటే ఏడుపు. దానికి ఆడుకునేటందుకు బొమ్మ కావాలిట. షావుకారుగారి శ్యామల బొమ్మ చూసినప్పటి నుంచీ దానికి బొమ్మపిచ్చి పట్టుకుంది," అన్నది.

"దాని మొహం! ఇందాకటినుంచీ ఆడి స్తున్నాను. దాని కసలు బొమ్మలతో ఆడు కోవటం చాతనైతేగా?" అన్నది నాయనమ్మ.

"నేనాడుకున్నా నేమిటి? ఆటంతా నువే ఆడుకున్నావు!" అన్నది చిట్టి నాయనమ్మతో.

మొదట్లో నాన్న చిట్టిని గురించి అంతగా ఆలోచించ లేదు. కాని చిట్టి సరిగా అన్నం తినకపోవటమూ, ఎవరితోనూ మాట్లాడక పోవటమూ చూసినాక ఇక ఉపేక్షించ రాదనుకుని పట్నంలో ఉన్న అల్లుడికి ఉత్తరం రాస్తూ, మంచి బొమ్మ ఒకటి కొని పోస్టులో చిట్టికోసం పంపమని కోరాడు.







## 3

మరో వారానికిగాని పట్నంనుంచి బొమ్మ రాలేదు. అది వచ్చే సమయానికి చిట్టికి బొమ్మ బెంగ పోనేపోయింది. అయినా కొయ్యపెట్టెలోనుంచి అట్టపెట్టె తీసి అందులోనుంచి బొమ్మ పైకి తీసేసరికి చిట్టి కళ్లు జిగేలుమన్నాయి.

ఎంత అందమైన బొమ్మ! ఎంత అద్భుతమైన బొమ్మ! ఆడబొమ్మ. ఎర్ర చొక్కా, ఆకుపచ్చ రంగు గౌనూ ఉన్నాయి. పెట్టెలోనుంచి పైకెత్తుతుంటే "క్యార్" మన్నది.

"ఇది భలే గమ్మత్తయిన బొమ్మర్రోయ్! పడుకోబెడితే కళ్లు మూస్తుంది. లేచి నిలబెడితే క్యారుమంటుంది!" అన్నాడు నాన్న.

ఆ బొమ్మను చూస్తుంటే చిట్టికి పంచప్రాణాలూ కొట్టుకున్నట్టయింది. ఆమె ఆ బొమ్మను గట్టిగా అదుముకుంటూ, "నా బొమ్మ! నా బుజ్జిబొమ్మ!" అని జపం చేసింది.

"మరి ఏడవకు! హాయిగా ఆడుకో! చూడు, చిట్టీ, బావ ఎంత డబ్బు పోసి కొన్నాడో ఏమో కాస్త భద్రంగా ఆడుకో. దాని కాళ్లూ, చేతులూ ఊడలాగావంటె ఎందుకూ పనికిరాదు." అన్నది అమ్మ.

"నా బొమ్మను నేనెందుకు పాడుచేసుకుంటానేమిటి?" అన్నది చిట్టి. ఆ పిల్ల నాయనమ్మ దగ్గిరికి వెళ్లి, "నా బొమ్మ చూశావా, నాయనమ్మా? ఇదుగో చూడు— పడుకోబెడితే కళ్లు మూసుకుంటుంది. పైకి ఎత్తితే క్యారుమంటుంది," అన్నది.

"ఏమీ బాగాలేదు నీ బొమ్మ! నా బొమ్మలే బాగున్నాయి!" అన్నది నాయనమ్మ మూతి విరుస్తూ.

చిట్టికి నాయనమ్మమీద మండిపోయింది.

ఒంటరిగా కూచుని చిట్టి చాలా సేపు బొమ్మతో ఆడుకుంది. దాన్ని భుజాన వేసుకుని చిచ్చికొట్టింది. కాస్సేపుండి ఎత్తి చూస్తే బొమ్మ కళ్ళు తెరుచుకునే ఉంది. తరవాత చంకన వేసుకు తిరిగింది. చంక

నుంచి భుజానికీ, భుజంనుంచి చంకకూ మార్చేటప్పుడల్లా బొమ్మ క్యావుమనేది.

చిట్టి బొమ్మకు తన పాటలన్నీ వినిపించింది. దాన్ని కాళ్ళమీద నిలువుగా పడుకోబెట్టుకునేసరికి అది కళ్లు మూసుకున్నది. దాన్ని నిద్రపుచ్చటానికి మోకాళ్లు ఎగరేస్తే "కుర్, కుర్" అన్నది.

త్వరలోనే చిట్టికి అది బొమ్మ అనే భావం పోయి దానికి నిజంగా ప్రాణం ఉన్నదన్న నమ్మకం కుదిరింది.

## 4

శామల తన బొమ్మ విషయంలో ఎంత నీచంగా ప్రవర్తించినదీ జ్ఞాపకంవచ్చి చిట్టి ఆ సాయంకాలమే తన బొమ్మను చంకన పెట్టుకుని అందరికీ చూపటానికి పోయింది. చిట్టి బొమ్మను చూసి రాధా, జయలక్ష్మి, అన్నపూర్ణా, కల్యాణీ, లక్ష్మి, శారదా— అందరూ తన్మయత్వం చెందారు. "పడుకోబెట్టితే ఎలా కళ్లు మూస్తుందో!....లేపితే ఎలా ఏడుస్తుందో!... గౌను ఎంత బాగుందో!... జుట్టుచూడు, ఎంత బాగుందో! రెండు జెడలు వేసి రిబ్బన్లు కట్టారు!....శామల బొమ్మ ఏమీ బాగాలేదు, నెత్తిన జుట్టే లేదు, నల్ల రంగు పూశా రంతే!" అందరూ ఈవిధంగా మాట్లాడుతుంటే చిట్టికి ఆనందం పొంగి, పొర్లి పరదలైపోయింది.

చిట్టి తన బొమ్మను అందరికీ ఎత్తుకోవటానికి ఇచ్చింది. శామల తన బొమ్మను ముట్టుకోనివ్వకపోతే తనకెంత కష్టం వేసిందో చిట్టి మరిచిపోలేదు; అందుచేత తన బొమ్మను ఎత్తుకుని అందరూ ఎంత ఆనందిస్తున్నారో చిట్టి ఊహించుకుని సంతోషించింది.





చిట్టచివరకు చిట్టి మంచితనం మూలానే కీడు కలిగింది. చిట్టి చూస్తూండగానే ఆ బొమ్మ కాస్తా అందరి ఉమ్మడిసొత్తూ అయింది. దాన్ని ఒకరి చేతిలోనుంచి ఒకరు లాక్కోసాగారు. బొమ్మ "క్యారు, క్యారు" మంటుంటే చిట్టి ప్రాణం గిలగిలా కొట్టుకు పోతున్నది. "నా బొమ్మ! నా బొమ్మ! నా కిచ్చెయ్యండి!" అని చిట్టి అరిచింది. కాని ఎవరూ వినిపించుకో లేదు.

ఒక పిల్ల చేతిలోకి బొమ్మ కాలు ఊడి వచ్చింది. చిట్టి కెవ్వున అరిచింది. ఒక్క సారిగా పట్టరానంత దుఃఖమూ, ఆగ్రహమూ వచ్చేసి తన బొమ్మను నాశనం చేసిన ఇద్దరు పిల్లలమీదనూ పడి చిట్టి రక్కేసింది. ఒక పిల్ల తన చేతిలో ఉన్న బొమ్మ కాలును విసిరి దూరంగా వేసింది. మిగతా బొమ్మను ఇంకా పట్టుకుని ఉన్న రెండో పిల్ల, "నీ వెధవబొమ్మ ఎవడిక్కావాలి?" అంటూ నేలకేసి కొట్టింది. తన బొమ్మ కింద పడ్డ చప్పుడుకు చిట్టి గుండెలు అవిసిపోయాయి. ఆ పిల్ల కళ్లనిండా నీరు నిండి ప్రపంచ మంతా మసకబారిపోయినట్టయింది.

"బొమ్మ కళ్లు పోయాయి! కళ్లు బొక్కలు పడ్డాయి!" అని ఎవరో అరవటం విని పించింది. చిట్టికి గుండె జారిపోయింది. అందరూ చేరి తన బొమ్మను హత్యచేసినట్టు తోచింది చిట్టికి. ఆమె గొంతెత్తి బిగ్గరిగా ఏడవసాగింది.

ఈలోపల మిగతా పిల్లలందరూ తుపాకీ వేసినట్టు మాయమయారు.

చిట్టి పది నిమిషాలపాటు ఏడిచి కళ్లు తుడుచుకుని చూసింది. బొమ్మ దగ్గిరలోనే పడిఉంది. నిజంగానే దానికి కళ్లు లేవు!



ఒక కాలుకూడా లేదు. ఆ కాలు అంత దూరాన గడ్డిలో పడిఉంది. వాటిని చూసి చిట్టి మళ్లీ బావురుమన్నది.

"ఛీ, ఛీ! మంచి అమ్మాయిలు అలా ఏడవొచ్చా!"

చిట్టి వెనక్కు తిరిగి చూసేసరికి ఆస్పత్రిలో మందులిచ్చే డాక్టరుగారు అటుగా వస్తూ కనిపించారు.

"నీపేరేమిటమ్మా? ఎందుకేడుస్తున్నావ్?"

ఎక్కిళ్ళతో మాట్లాడలేకుండా చిట్టి జరిగిన సంగతి డాక్టరుగారితో చెప్పటానికి యత్నించి, చాతగాక బొమ్మకేసి చూపించి మళ్ళీ వలవలా ఏడవసాగింది.

"ఓ! ఇదా సంగతి?" అంటూ డాక్టరుగారు వంగి బొమ్మను తీసి పైకెత్తి అటూ ఇటూ తిప్పి చూశారు. తరవాత ఆయన, "దీని కాలొకటి పోయిందే!" అన్నారు. చిట్టి ఏడుస్తూనే దూరాన గడ్డిలో ఉన్న కాలుకేసి చూపింది.



డాక్టరుగారు ఆ కాలుకూడా తీసుకుని పరీక్షించాడు. తరవాత ఆయన చిట్టితో, "నువు ఏడవవలిసిన పని లేదే! నీ బొమ్మకు జబ్బుచేసింది, అంతే! చిన్న ఆపరేషన్ చేసి నయం చెయ్యవచ్చు. ఇటువంటి పనులు చెయ్యటానికి ఆస్పత్రి ఉందని నీకు తెలీదూ! రా పోదాం!" అన్నారు.

చిట్టి ఏడవటం మాని కళ్లు తుడుచుకుంటూ, "ఆపరేషన్ చేస్తే బొమ్మ బాగుపడుతుందా, డాక్టరుగారూ?" అన్నది.

"చేసి చూద్దాం!" అన్నాడు డాక్టరుగారు.

ఆస్పత్రి చేరేలోపల చిట్టి తనకు ఆ బొమ్మను పట్నంనుంచి ఆరోజే బావ పంపించిన సంగతి, పిల్లలందరూ చేరి బొమ్మను హింసపెట్టిన సంగతి వివరంగా చెప్పింది.



"చూశావా? ఈ బొమ్మ నీ బిడ్డ అన్నమాట! నీ బిడ్డను నువు చూసుకున్నంత బాగా ఇంకోరు చూస్తారా? అందుకని నీ బొమ్మను ఎప్పుడూ ఇంకొకరి కివ్వరాదు!" అన్నాడు డాక్టరుగారు.

ఇద్దరూ ఆస్పత్రిలో ప్రవేశించారు. డాక్టరుగారు బొమ్మను తన బల్లమీద పెట్టి, "ముందు చిన్న ఆపరేషన్ చేద్దాం. ఇది కాలు ఆపరేషన్," అన్నారు.

తన బొమ్మకాలు ఊడిరావటం చూసి చిట్టి హడలిపోయిందేగాని అది తిరిగి అమర్చటానికి డాక్టరుకు నిమిషంకూడా పట్టలేదు. రబ్బరులాగా సాగే దారంతో ఆ కాళ్లు బొమ్మ శరీరానికి అమర్చబడ్డాయి. కాలు అమర్చాక డాక్టరు దానిని అన్ని వైపులకూ తిప్పి చూపించి, "చూశావా? కాలు బాగైపోయింది!" అన్నారు.

చిట్టి ముఖం క్షణంపాటు వికసించి మళ్లీ ముడుచుకున్నది. ఆ పిల్ల, "మరి కళ్లో?" అన్నది విచారంగా.

"ఇది చాలా పెద్ద ఆపరేషన్, నువ్వు చూస్తే భయపడిపోతావు. కాస్సేపు గది అవతలికి పోయి కూచుంటావా?" అన్నాడు డాక్టరుగారు.

పరిస్థితి అర్థం చేసుకున్నదానల్లె చిట్టి గంభీరంగా లేచి బయటికి వెళ్లిపోయింది. తన బొమ్మకు పెద్ద ఆపరేషన్ జరుగుతున్నదని ఆమె ఎంతో బెంగపడింది.

డాక్టరుగారు ఉపాయంగా బొమ్మ నెత్తి మీద అంటించిన జుట్టు తీసేసి, తల కత్తితో కోసి, లోపల రాలిపడిన కళ్లను మళ్లీ యథాస్థానంలో అమర్చి, తల మూసేసి, జుట్టు ఎప్పటిలాగే అంటించేశారు. చిట్టిని లోపలికి పిలిచేలోపల ఆయన బొమ్మ కళ్ల తాలూకు నల్లగుడ్లు పైకీ కిందికీ కదులుతూండటం సరిచూసుకున్నాడు.

డాక్టరుగారి కేక విని లోపలికి వచ్చి ఆయన చేతిలో ఉన్న బొమ్మను చూసి సంతోషంతో పెద్ద కేక పెట్టింది చిట్టి. బొమ్మను పడుకోపెట్టింది, ఎత్తింది, అది క్యారు మనగానే గట్టిగా దాన్ని వాటేసుకుని ముద్దుపెట్టుకున్నది.

"ఎప్పుడన్నా బొమ్మకు జబ్బు చేస్తే నా దగ్గిరికి తీసుకొస్తావుగదూ?" అన్నాడు డాక్టరుగారు.

"తప్పక తీసుకొస్తానండి! ఈ ఆపరేషను ఎంతవుతుందండి?" అన్నది చిట్టి గంభీరంగా.

"ఎంతో కాదు, రెండు ముద్దులు!" అంటూ డాక్టరుగారు చిట్టిని ఎత్తుకుని రెండు చెంపలమీదా రెండు ముద్దులు పెట్టుకున్నారు.





# క్షీరసాగర మథనము

కశ్యపు డను బ్రహ్మర్షికి
కలరెండఱు సతీమణులు.
అందఱిలో అదితి పెద్ద;
ఆమె కొడుకు లాదిత్యులు.

అదితికి సోదరి యగు దితి;
ఆమె సుతులు దైతేయులు.
ఆదిత్యులు, దైతేయులు
అల కశ్యపముని బిడ్డలు.

తెలివి నొంది ఆదిత్యులు
దేవత లనిపించుకొనిరి;
ఉక్కుమిగిలి దైతేయులు
రక్కసు లనిపించుకొనిరి.

దేవతలకు, రక్కసులకు
దినదినమును పోరాటము!
పిల్లల చెడు నడవడులకు
తల్లులకును ఆరాటము!

పెద్దవారి పలుకులెల్ల
పెడ చెవులను పెట్టి తుదకు
దేవత లోక రక్కసు లోక
తెగతెగగా విడిపోయిరి.

దేవతలకు ఇంద్రుండను
ధీరు డొకడు ప్రభు వయ్యెను.
అమరావతి యను పురమును
ఆతడు ఏలగ సాగెను;

నందన మను పూదోటను
నాటించెను తన పురమున;
సిద్ధ సాధ్య గంధర్వుల
చేరదీసె తన వైపున.

తన రాజ్యమునం దాతడు
తఱుగన్నది లేకుండగ
సకల సౌఖ్యములను గూర్చి
స్వర్గ మ్మొనరించినాడు.

ఉత్పల సత్యనారాయణాచార్య

ఒక్కనాడు దుర్వాసుడు,
ముక్కోపము గల తాపసి,
ఇంద్రుని కడ కేగుదెంచి
ఇచ్చెను ఒక పూదండను.

ఆ దండను ధరియింపక
అవల బెట్టి దేవేంద్రుడు,
"నందనవన సుమము లుండ
నా కేటికి ఈ పూవులు?"

అని నంతట దుర్వాసుడు
కను లెఱ్ఱగ జేసి చూచి,
"నీ వైభవ మికమీదట
నీట గలసి పోవుగాక!"

అని శపించి ఆ మహర్షి
అచటినుండి చెరచెర చనె—
ఎప్పటివలె దేవేంద్రుడు
ఏలసాగె స్వర్గమ్మును;

అంగిరసుని మంత్రి జేసి
ఆప్తుని గావించుకొనెను;

మునుల నెల్ల గౌరవించి
తనవారిని చేసికొనెను.

దేవేంద్రుని వైభవమును
దితి కొడుకులు సహియింపక
అమరావతి ముట్టడింప
ఆలోచన సాగించిరి.

బలి యను ఒక బలశాలిని
ప్రభువును గావించుకొనిరి;
పలువిధముల ఆయుధములు
పదను పెట్టి ఉంచుకొనిరి.

"ఎపుడెపుడా బలి యానతి?
ఏదేదీ అమరావతి!
దేవతలను హతమార్తుము!
దివిని గూల్చి పగదీర్తుము!"

అని మెఱయుల వంటివారు
దనుజరాజు నానతి గొని,
క్రొవ్విన పస ఇంద్రుని పస
క్రోధమ్ములు వెలిగ్రక్కిరి.



సింహమ్ములపై, బెబ్బులి
చిఱుతలపయి, ఖడ్గులపై
ఎక్కి వచ్చి అమరావతి
నొక్కుమ్మడి దండెత్తిరి.

నేరుగ చని ఇంద్రభవన
ద్వారపాలకులను చంపి,
అచటి మునుల రెట్ట బట్టి
అవతల పడవైచినారు.

తమకు తాము గద్దె లెక్కి
తగుదు మంచు గూర్చుండిరి;
గొప్పగొప్ప దేవతలును
గ్రుక్కు మిక్కు మనకుండిరి.

ఇంద్రుండును పాలుపోక,
ఏ పనియును చేయలేక,
తనదు కోపభర మెల్లను
మనసులోన అణచుకొనెను.

కలత యొఱుకపడకుండగ
గాంభీర్యముతో నాతడు

దితి కొడుకుల గౌరవించి
తియ్యని పలుకుల నాడెను.

రక్కసులకు పేరుపేర
పెక్కు కాన్క లర్పించెను;
పట్టువస్త్రముల నొసంగి
భయభక్తుల నర్పించెను.

అటుపిమ్మట ఇంద్రుడు తన
భటుల బిలిచి, "మనవారికి
సకల సుఖము లుండునట్టి
సౌధమ్ముల నొసగు," డనెను.

ఆ మాటలు విని దైత్యులు,
"ఏమిటి నీ అధికారము?
ఇతరు లిచ్చుదానికొఱకు
ఎదురు చూచుటేల మాకు?

"ఈ మాటలు కట్టిపెట్టి
ఇక పురమును విడచి పొమ్ము!
బ్రతుకుపైని ఆశ యున్న
బలిరాజును సేవింపుము!



"చెప్పినట్లు విను మిక, మా
చేతిలోనివాడ వీవు!"
అనిన నగుచు దేవేంద్రుడు
దనుజులతో నిట్లనియెను:

"అవునవు నే మీవాడను.
ఆ మాటల కేమి గాని,
మనమందఱ మన్నదమ్ము
లను మాటను మఱచినారు!

"అక్క చెల్లెండ్రుల బిడ్డల
మైన మనకు మన లోపల
పగ యేటికి? కలిసి మెలసి
బ్రతుకుద మన మందఱమును!

"బలి యన్నను నా కిష్టమె;
ప్రభు వౌటకు తగు నాతడు!
అతని అండదండలతో
అమరావతి శోభిల్లును,"

అని పలుకుచు దేవేంద్రుడు
దనుజుల శాంతింప జేసి,

వారి బారి పడకుండగ
పారిపోయె నెక్కడకో.

స్వర్గము కళ దప్పిపోయె,
జను లెవ్వరు లే రచ్చట!
దేవిడీలు లోగిళ్ళను
బావురు మనుచుండినయవి!

తోకచుక్క లాకసమున
తోతెంచెను పట్టపగలు;
సుడిగాలులు ఆమరావతి
జుట్టుకొనెను నలువైపుల!

గంగానది హెూరుమనుచు
పొంగులెత్తి ముంచెత్తెను;
నందనవన మొక్కసారి
నట్టేటను కలసిపోయె!

రక్కసులా అలజడులకు
బిక్కమొగము వైచినారు;
అమరావతి వదలిపెట్టి
తమ చోట్లకు తరలినారు!–(సశేషం)






# పట్టాభిషేకం

తన అన్న అయిన వాలి తన రాజ్యాన్నీ, భార్యనూ అపహరించగా రాజ్యభ్రష్టుడై ఉన్న సుగ్రీవుడు, తనకు రాముడు నిజంగా తోడ్పడగలడో లేడో తెలుసుకోగలందులకై, హనుమంతుణ్ణి వెంటబెట్టుకుని రామలక్ష్మణు లున్నచోటికి వచ్చాడు. వారందరూ కిష్కింధకు కొంచెం దూరంలో కలుసుకున్నారు. రాముడు విడిచిన బాణం ఏడు సాలవృక్షాలను పడగొట్టి తిరిగి రావటం స్వయంగా చూసేసరికి సుగ్రీవుడికి రాముడిలో నమ్మకం కుదిరింది.

నలుగురూ కిష్కింధకు తిరిగి వచ్చారు. మిగతా ముగ్గురినీ అంత దూరాన విడిచి సుగ్రీవుడు ముందుకు వచ్చి వాలిని తనతో యుద్ధానికి రమ్మని పిలిచాడు. వాలి సుగ్రీవుడి కేక విని వెళ్ళబోతుంటే తార వద్దని బతిమాలింది. ఒకప్పుడు వాలితో ఓడి పారిపోయిన సుగ్రీవుడు ఏదో కారణం లేనిదే వచ్చి ఉండడనీ, వాలి తన మంత్రులతో సంప్రతించి మరీ వెళితే బాగుంటుందనీ ఆమె అన్నది. కాని వాలి ఇంద్రుణ్ణీ, శివుణ్ణీ కూడా లెక్కచేసేవాడు కాడు.

అతను సుగ్రీవుడితో యుద్ధానికి వచ్చాడు. ఇద్దరూ కొంతసేపు ఘోరంగా యుద్ధం చేసిన మీదట వాలి ఒక్క గుద్దుతో సుగ్రీవుణ్ణి పడగొట్టాడు. హనుమంతుడు తన నాయకుడి దుస్థితి చూసి కలతపడి రాముడికి అతను చేసిన వాగ్దానం జ్ఞప్తికి తెచ్చాడు. రాముడు ఒక బాణం ఎక్కుపెట్టి వాలిని కొట్టాడు. ఆ దెబ్బకు మూర్ఛపోయిన వాలి తిరిగి స్పృహ వచ్చి, తనకు గుచ్చుకున్న బాణాన్ని పెరికి దానిపైన గల రాముడి పేరు చదువుకుని, "రామా, నన్ను ఇలా కొట్టటం అధర్మం కాదా?" అని అడిగాడు. "మృగాలను చాటున పొంచి కొట్టటం అధర్మం కాదు. తమ్ముడి భార్యను తన భార్యగా చేసుకున్న



వాడు మనిషి కాడు, మృగప్రాయుడు!" అన్నాడు రాముడు. వాలి ప్రాణాలు విడుస్తూ తన కొడుకైన అంగదుణ్ణి సుగ్రీవుడికి అప్పగించి, తనవద్ద ఉండే హేమమాలను తమ్ముడి పరం చేసి, హనుమంతు డిచ్చిన నీరు తాగి ప్రాణాలు వదిలాడు.

రాముడు సుగ్రీవుణ్ణి కిష్కింధకు రాజుగా పట్టాభిషేకం జరిపించాడు. ఇందుకు ప్రత్యుపకారంగా సీత జాడ తెలుసుకుని రావటానికని సుగ్రీవుడు తన వానర సమూహాలను అన్నివైపులకూ పంపాడు. అంగద కుమారుడూ, హనుమంతుడూ మొదలైన వారు దక్షిణదిశగా వెళ్ళి, సీత లంకలో ఉన్నట్టు తెలుసుకున్నారు. హనుమంతుడు సముద్రాన్ని లంఘించి లంక చేరుకున్నాడు.

హనుమంతుడు లంకానగరమంతా తిరిగి సీతను అన్వేషించాడు. ఆ నగరం అతని కళ్ళకు స్వర్గతుల్యంగా ఉన్నది—ఎక్కడ చూసినా అద్భుతమైన బంగారు తోరణాలూ, చక్కని మైదానాలూ, తెల్లని భవంతులూ ఉన్నాయి—కాని సీత జాడ లేదు. ఇంత అందమైన నగరాన్ని రావణుడు మూర్ఖుడై నాశనం చేసుకోబోతున్నాడే అనుకుంటూ హనుమంతుడు స్త్రీజనం ఉండే చోట్లా, స్నానఘట్టాలూ, గర్భాలయాలూ, మండపాలూ, డాబాలూ, చీకటికొట్లూ, తోటలూ ఘాలించాడు. చివరకు అతను చేతిలో రాముడి ముద్రికను పట్టుకుని ఒక వనంలో ప్రవేశించాడు.

అక్కడే సీతాదేవి రాక్షస స్త్రీల మధ్యను కూర్చుని ఉన్నది. రావణుడు తనను లంకకు తెచ్చినది లగాయతు ఆమెకు జీవితం దుర్భరంగా ఉన్నది. రోజూ రావణుడు తన వద్దకు వచ్చి తనను ప్రేమించి తన భార్యకమ్మని కోరటం మరీ దుర్భరంగా ఉన్నది. అయితే ఏనాటికైనా రాముడి బాణాలు తనను రక్షించకపోతాయా అన్న ఆశతో ఆమె ప్రాణాలు బిగబట్టుకుని ఉన్నది.

"ఓహూ, కారుమేఘాల మధ్య మెరుపు తీగలాగా వికారాకారాలు గల రాక్షసుల మధ్య ఎవరో స్త్రీ కూచుని ఉన్నదే. సీత కాదుగద!" అనుకున్నాడు హనుమంతుడు. అంతలోనే దివిటీలు ధరించి నౌకర్లు వెంట రాగా రావణుడు సీతదగ్గిరికి వచ్చాడు. హనుమంతుడు చప్పున ఒక అశోకవృక్షం ఎక్కి, దాని కొమ్మల మధ్య దాగి అంతా చూడసాగాడు.

"సీత ఈ చెట్టు మొదట్లో కూచుని ఇంకా తన రాముణ్ణి గురించే ఆలోచిస్తోందా? ఆ మానవమాత్రుడికోసం అన్ని సుఖాలూ త్యాగంచేస్తూ, నాకు వశంకాకుండా ఉన్నదే! పైపెచ్చు సింహాన్ని చూసిన లేడిలాగా నాకేసి చూస్తుందిగద!" అనుకున్నాడు రావణుడు.

"వైరిసీతా, ఈ ఘోర తపస్సు చాలించు! నిన్ను రక్షించలేని ఆ రాముణ్ణి ఇంకెంత కాలం ప్రేమిస్తావు? అతను నాలాగా నిన్ను ప్రేమించలేడు," అన్నాడు సీతతో రావణుడు.

రాముడు అసమర్థుడనే మాట చెవిని పడేసరికి హనుమంతుడికి మండుకొచ్చింది. ఆ రావణుణ్ణి వీలైతే అప్పుడే చంపటమో, ఆ ప్రయత్నంలో చావటమో చేద్దామని కూడా అనుకున్నాడు. "నామాటకేంచెబు



తావు?" అని రావణుడు మళ్ళీ అడిగేసరికి, "నిన్ను శపిస్తాను!" అన్నది సీత. పతివ్రతా ప్రభావంచేత కాబోలు రావణుడి శరీరం మంటలెత్తింది.

అతను మారు మాట్లాడకుండా స్నానం చెయ్యటానికి వెళ్ళిపోయాడు.

వెంటనే హనుమంతుడు చెట్టు దిగివచ్చి, సీతను సమీపించి, తాను రాముడి దూత ననీ, రాముడు ఆమెకోసం ఆందోళన పడుతున్నాడనీ చెప్పాడు. మొదట సీత నమ్మక, ఇదంతా రాక్షసమాయ అనుకున్నది. హనుమంతుడు ఆమెకు ముద్రిక చూపించి తన పేరు చెప్పుకుని, వాలి వధా, సుగ్రీవ మైత్రీ



మొదలైన వివరాలన్నీ సీతకు నివేదించాడు; రాముడు విధిగా లంకకు వచ్చి రావణుణ్ణి చంపుతాడన్నాడు.

"ఇదంతా నిజమా? కల కాదుగద?" అన్నది సీత.

హనుమంతుడు ముమ్మాటికీ నిజమని చెప్పాడు.

"అయితే రాముడికి నా పరిస్థితి చెప్పు. కాని, జాగ్రత్తసుమా, నా సంగతి విని ఆయన శోకవివశుడు కాకుండా మాత్రం చూడు!" అన్నది సీత.

"ఇక నేను రావణుడికి నా రాక ఎరిగించాలి. అందుకుగాను ఈ అందమైన వనాన్ని నాశనంచేసి వాడి దర్పం అణుస్తాను!" అన్నాడు హనుమంతుడు.

అతను అన్నంత పనీ చేశాడు. మండోదరీ మహారాణి కూడా ఒక్క పువ్వుగాని, దళంగాని కోయటానికి సంశయించే అశోకవనాన్ని పూర్తిగా ధ్వంసం చేశాడు.

శంకుకర్ణుడనేవాడు ఈ వార్త చెప్పగానే రావణుడు, ఆ కోతిని పట్టి తేవటానికి తగిన బలాన్ని పంపాడు. వెయ్యిమంది భటులు వెళ్ళి హనుమంతుడి చేతిలో చచ్చారు. తరవాత అక్షుడి వెంట మరి అయిదుగురు సేనాపతులు హనుమంతుడిపైకి వెళ్ళి తమ ప్రాణాలు కోల్పోయారు. ఈ వార్త విని రావణుడు తానే స్వయంగా బయలుదేరి ఆ కోతిని పట్టుకుందా మనుకుంటూండగా ఇంద్రజిత్తు వెళ్ళినట్టు తెలిసింది.

హనుమంతుడు కొంతసేపు ఇంద్రజిత్తుతో హోరాహోరి పోట్లాడి చివరకు కావాలనే పట్టుబడ్డాడు. ఎందుకంటే అతనికి రావణుణ్ణి చూడాలని బుద్ధిపుట్టింది.

ఏ దేవతలూ చేయ సాహసించని పనిని ఒక కోతి చెయ్యటం రావణుడికి ఆశ్చర్యం కలిగించింది. "నేను కైలాసాన్ని ఊపి శివుడివల్ల వరం పొందినప్పుడు పార్వతీ, నందీ నన్ను శపించారు. ఆ శాపమే ఈ కోతి

రూపంలో రాలేదుగద!" అనుకుంటూ రావణుడు, చిక్కిపోయిన ఆ కోతిని తన ఎదటికి తీసుకురమ్మనీ, విభీషణుణ్ణి పిలిపించమనీ ఉత్తరువు చేశాడు.

విభీషణుడు వచ్చాడు, బంధించి హనుమంతుణ్ణి కూడా తెచ్చారు. "ఎవరు నీవు?" అని రావణుడు అడిగేసరికి, "నేను హనుమంతుణ్ణి; వాయుదేవుడికీ అంజనాదేవికీ పుట్టినవాణ్ణి. రాముడు పంపగా వచ్చాను. రామాజ్ఞ వినిపిస్తాను!" అన్నాడు హనుమంతుడు.

"రామాజ్ఞ" అనే మాట వినబడేసరికి రావణుడు మండిపడి, "ఈ కోతిని చంపండి!" అన్నాడు. విభీషణుడు అన్నకు అడ్డువచ్చి, "ఎన్నితప్పులు చేసినా దూతను దండించరాదు. ఏమైనా, రాముడి సందేశం విని ఆ తరవాత ఇష్టంవచ్చినట్టు చేయవచ్చు గదా!" అన్నాడు.

రావణుడిందుకు సమ్మతించగా హనుమంతుడు రాముడి సందేశం ఇలా చెప్పాడు: "ఎంత భద్రమైన చోటికైనా వెళ్ళు; శంకరుడి చాటున ఉండు; దుర్గమమైన రసాతలంలోకి వెళ్ళు; నా బాణాలు నిన్ను అంగమంగమూ చీల్చి యమలోకానికి పంపి తీరుతాయి!"




రావణుడు వికటంగా నవ్వి, "నా దివ్యాస్త్రాలకు దేవతలు హడలిపోయారు. రాక్షసేంద్రులందరూ నాకు లోబడి ఉన్నారు. కుబేరుడి వంటి వాడివద్ద పుష్పక విమానం లాగేసుకున్నాను. మానవమాత్రుడు రాముడు నన్నెలా ఎదిరించి పోరాడగలడు?" అన్నాడు.

"అంత గొప్పవాడివి సీతను రహస్యంగా మాయచేసి తెచ్చావే?" అని హనుమంతుడడిగాడు.

ఈ మాటకు విభీషణుడు హర్షించాడు. "నా శత్రువుల పక్షం అవుతున్నావా?" అని రావణుడు తమ్ముణ్ణి అడిగాడు.



"లేదు. కాని సీతను తిప్పి పంపెయ్యి. రాక్షస కులాన్ని నిర్మూలించకు," అన్నాడు విభీషణుడు. కాని రావణుడు ఆ హితం పాటించక ప్రగల్భాలాడాడు.

"ఓ రావణా, నీ పాపం పండింది. రాము డంటే ఎవరనుకున్నావు? భువనైక నాథుడు!" అన్నాడు హనుమంతుడు. తనను పేరు పెట్టి పిలిచినందుకు ఆ కోతిని చంప మని రావణుడు ఉత్తరువిచ్చాడు; కాని దూత అన్న మాట జ్ఞాపకం వచ్చి, తోకకు నిప్పు అంటించమన్నాడు.

అతను హనుమంతుడితో రాముడికి ప్రతి సందేశం ఇలా చెప్పాడు: "నేను నీ భార్యను హరించి నిన్ను అవమానించాను. విలు విద్యలో ఘటికుడవైతే నాతో యుద్ధంచెయ్యి."

హనుమంతుడు రావణుణ్ణి మరొకమారు హెచ్చరించి వెళ్ళిపోయాక విభీషణుడు అన్నకు హితబోధ చెయ్య యత్నించాడు. ఆ హితం రుచించక రావణుడు తన తమ్ముణ్ణి శత్రుపక్షంవాడని నిందించి లంక నుంచి పొమ్మన్నాడు. రాక్షసకులం కొంత అయినా దక్కుతుందనుకుంటూ విభీషణుడు వెళ్ళిపోయాడు. రావణుడు నగర రక్షణకు ఉపక్రమించాడు.

హనుమంతుడు తిరిగి రాగానే రామలక్ష్మణులు సుగ్రీవుడితోనూ వానరసేనతోనూ కదిలి సముద్రతీరం చేరుకున్నారు. "నేను నదులూ, కొండలూ, అడవులూ దాటి సముద్రం చేరుకున్నాను. ఎక్కుపెట్టిన నా బాణానికీ, శత్రువుకూ మధ్య ఈ సముద్రం అడ్డుండిపోయింది," అన్నాడు రాముడు.

ఇంతలో ఆకాశమార్గాన విభీషణుడు వచ్చాడు. అతనిని గుర్తించగానే హనుమంతుడు, "ఆ వచ్చేది ధర్మాత్ముడైన విభీషణుడు. అన్నగారు వెళ్ళగొట్టగా శరణార్థి అయి వస్తున్నాడు," అని రాముడితో చెప్పాడు. రాముడు పంపగా లక్ష్మణుడు ఎదురువెళ్ళి స్వాగతం చెప్పాడు. సుగ్రీవుడు



మాత్రం శంకించాడు; రాక్షసులు మాయావు లని అతనికి తెలుసు. కాని హనుమంతుడు విభీషణుడి మంచితనం శంకించ నవసరం లేదనీ, అతను లంకలోనే తన అన్నను ప్రతిఘటించాడనీ చెప్పాడు.

రాముడు విభీషణుణ్ణి సముద్రం దాటి లంక చేరే ఉపాయం అడిగాడు. "సముద్రుడు దారి ఇవ్వకపోతే అతడిపైన మీ అస్త్రం ప్రయోగించండి," అన్నాడు విభీషణుడు.

రాముడు బాణం ఎక్కుపెట్టేసరికల్లా వరుణుడే స్వయంగా వచ్చాడు; రాముడికి నమస్కారం చేసి, "నాపైన ఇంత ఆగ్రహించారు. మీ పని సెలవివ్వండి," అన్నాడు.

"లంకకు పోవటానికి దారి కావాలి," అన్నాడు రాముడు.

వెంటనే సముద్రజలం రెండుగా చీలి దారి ఇచ్చింది. ఆ దారి వెంట రాముడూ, అతని అనుచరులూ, వానరసేనా లంకను చేరుకున్నారు.

ఇంతలో నీలుడు రెండు కొత్త కోతులను పట్టుకొచ్చి రాముడి ఎదట పెట్టాడు. విభీషణుడు వారిని చూసి శుక సారణులనే రాక్షసులని పోల్చాడు. వారు శరణార్థులమై వచ్చామని బొంకారు. కాని వారు రావణుడి నమ్మినబంట్లని విభీషణు డెరుగును, అందుకని వారిని శిక్షించమని రాముడితో అన్నాడు.






"వీళ్ళను శిక్షించి సాధించే విజయ మేమున్నది? ఇంతలోనే రావణుడు చచ్చి పోతాడా?" అంటూ రాముడు వారిని విడిచి పుచ్చమన్నాడు. లక్ష్మణుడి సూచనపై ఆ వేగులవాళ్ళకు వానర శిబిరమంతా చూపించి, వారిద్వారా రాముడు రావణుడికి ఇలా సందేశం పంపాడు: "నా భార్యను అపహరించి తెచ్చి ఈ యుద్ధం నీ నెత్తికి తెచ్చుకున్నావు. నేను వచ్చాను, కాని నీవింకా నా కళ్ళ పడలేదు."

ఈ సందేశం తీసుకుని రావణుడు పంపిన వేగులవాళ్ళు వెళ్ళిపోయారు. ఉభయపక్షాలకూ యుద్ధం సాగింది.

రాక్షసకుల నాశనం అరంభమయింది. కుంభకర్ణుడూ మొదలైన యోధులు చని పోయారు. ఈ యుద్ధం మాని, సీతను రాముడికి ఇచ్చేసి సంధి చేసుకోమని మంత్రులు రావణుడితో చెప్పారు. కాని అతనికి సీతపై భ్రమ తగ్గలేదు. అతను విద్యుజ్జిహ్వుడనే వాణ్ణి పిలిపించి రామ లక్ష్మణుల తలల లాటివి, మాయ శిరస్సులు, తయారుచేసి తెమ్మని ఆజ్ఞాపించాడు.

రాక్షస స్త్రీలమధ్య సీత కూచుని ఉన్నది. తన భర్త లంకకు వచ్చాడన్న వార్త తెలిసి ఆమె ఎంతో ఆనందించింది. అంతలో రావణుడు అక్కడికి వచ్చి, "నీ దురాశ మాను. రామ లక్ష్మణులు యుద్ధంలో చావబోతున్నారు," అన్నాడు.

ఆ సమయానికి విద్యుజ్జిహ్వుడు మాయ శిరస్సులను తెచ్చి రావణుడికి సమర్పించాడు. వాటిని చూస్తూనే సీత మూర్ఛపోయింది. తరవాత తెలివివచ్చాక ఆమె రాముడికోసం విలపిస్తూ, రాముణ్ణి చంపిన కత్తితోనే తననుకూడా చంపమన్నది.

"వెర్రిదానా, ఇంద్రజిత్తు నీ రాముణ్ణి లక్ష్మణుడితోసహా చంపేశాడు. ఇప్పుడు నీకెవరు దిక్కు?" అని రావణుడు సీతను అడుగుతుండగా, "రాముడు, రాముడు,"

అంటూ ఒక రాక్షసుడు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"ఆ నరాధముడు ఎక్కడున్నాడు? ఏంచేశాడు?" అని రావణుడు ఆ రాక్షసుణ్ణి చిరాకుగా అడిగాడు.

"ఏంచెప్పను, మహారాజా? ఇంద్రజిత్తును చంపేశాడు," అన్నాడు రాక్షసుడు. వెంటనే రావణుడు మూర్ఛపోయాడు. అతను తెలివి తెచ్చుకుని, "ఛీ, ఈ సీత కోసంగదా అయిన వాళ్ళనందరినీ చంపుకున్నాను! ఇంత జరిగాక నాకు సీత ఎందుకు, త్రైలోక్యాధిపత్యమెందుకు?" అని వాపోయాడు.

అంతలో ఒక దూత వచ్చి రాముడు తన సేనను తీసుకుని లంకానగరాన్ని భస్మీపటలం చేయవస్తున్నట్టు చెప్పాడు. రావణుడు రాముణ్ణి ఎదుర్కొనబోతూ సీతను చంపెయ్యా నిర్ణయించాడు. అయితే ఇతర రాక్షసులు అతన్ని వారించి, అందుకిది అదను కాదనీ, కాకపోయినా ఆమెను చంపటంచేత ఒరిగేదేమీ లేదనీ చెప్పారు. రాముణ్ణి చంపుతానని సీతను హెచ్చరించి రావణుడు రథమెక్కి వెళ్ళిపోయాడు.

రామ రావణులకూ, వానర రాక్షసులకూ మధ్య యుద్ధం జరిగింది. రావణుడి బాణాలలో ఒక్కటికూడా రాముణ్ణి గాయపరచ



లేదు. పాదచారి అయి యుద్ధం చేస్తున్న రాముడిపైకి రావణుడు తన రథాన్ని నడిపించాడు. ఆ క్షణంలోనే ఇంద్రుడు తన సారథి అయిన మాతలితో ఒక రథాన్ని పంపాడు. రాముడు దానిపైకి ఎక్కి బ్రహ్మాస్త్రం ఎక్కుపెట్టి ప్రయోగించేసరికి అది రావణుణ్ణి చంపి, రాముడి వద్దకు తిరిగి వచ్చింది.

రాముడు విభీషణుణ్ణి లంకకు రాజుగా ప్రకటించాడు. ఇంతలో సీత తన వద్దకు వస్తున్న వార్త తెలిసి అతను విభీషణుడితో, "ఆమె రావణుడి దగ్గిర ఉండటంచేత అపవిత్రురాలై, ఇక్ష్వాకు వంశ ఖ్యాతికి

కళంకం ఏర్పడింది. ఆమెను రానివ్వవద్దు," అన్నాడు. సీతను చూడాలని తనకు ఎంత ఆత్రంగా ఉన్నప్పటికీ తన కోరికనుకూడా అతను అణుచుకున్నాడు.

రాముడు తనను గురించి అన్న మాట విని సీత లక్ష్మణుడితో, తాను చితి పేర్చుకుని అందులో కాలిపోవటానికి రాముడి అనుమతి సంపాదించమన్నది. లక్ష్మణుడు రాముడితో ఈ మాట అన్నాడు. రాముడు సరేనన్నాడు. లక్ష్మణుడు నిర్వీర్యుడైపోయి హనుమంతుడితో, "చాతనైతే అన్నగారి ఆజ్ఞ నిర్వర్తించు!" అన్నాడు.

"మీ ఉద్దేశంకూడా అదేనా?" అన్నాడు హనుమంతుడు ఆశ్చర్యంతో. "మన ఉద్దేశాలకు తావు లేదు. అన్నగారి ఆజ్ఞ పాలించవలిసిందే," అన్నాడు లక్ష్మణుడు.

తరవాత సీత అగ్నిప్రవేశం చేసేటప్పుడు లక్ష్మణుడు ఆశ్చర్యంతో, "అయ్యో, మీ శ్రమయావత్తూ వ్యర్థంచేస్తూ సీత అగ్నిలోకి, తామర కొలనులో హంసలాగా, ప్రవేశిస్తున్నది!" అన్నాడు.

"ఆమెను ఆపు, ఆపు!" అన్నాడు రాముడు. కాని సీత అగ్ని ప్రవేశించనే ప్రవేశించింది. అయితే అగ్ని ఆమెను ఏమీ చెయ్యలేదు. పైపెచ్చు ఆమె శుద్ధిచేసిన బంగారంలా మరింతగా ప్రకాశించింది.

అగ్నిహోత్రుడు ప్రత్యక్షమై ఆమెను చెయ్యి పట్టి రాముడివద్దకు తెచ్చి, "ఈమె అకళంక, లోకపూజనీయ! నీవు నారాయణుడవు, ఈమె లక్ష్మి!" అన్నాడు.

"ఆమె పవిత్రతను నేనెరుగుదును. కాని లోకానికి తెలియగలందులకే ఇలా చేశాను," అన్నాడు రాముడు.

అగ్నిదేవుడే సీతారాములకు స్వయంగా రాజ్యాభిషేకం జరిపించాడు. ఆ సమయానికే భరత శత్రుఘ్నులు పౌరులను వెంటబెట్టుకుని వచ్చారు. అగ్నిదేవుడు రాముడికి ఇంద్రాదుల ఆశీస్సులు అందజేశాడు.



స్థల పురాణం:

# తాడువాయి

(ప. గో. జిల్లా.)

**మా** వూరి పేరు తాడువాయి. దక్షయజ్ఞ విధ్వంసకుడు, ఉగ్ర స్వరూపి అయిన వీరభద్రుడు ప్రశాంత రూపంలో మా వూర వెలిశాడు. అది మా దురదృష్టమో ఏమోగాని ఆయన మా వూరికి రెండుమైళ్ళ దూరంలో తన ముఖాన్ని కామవరపు కోట అనే ఇంకో వూరివైపు (దక్షిణంగా) పెట్టి వెలిశాడు. పెద్దవాళ్ళ నడిగితే ఒక వింతైన కథ చెపుతారు.

ఆ పైన చెప్పిన కామవరపుకోటకు ఒక బ్రహ్మరాక్షసి వచ్చి అందరినీ నానాహింసలూ పెడుతోందట. ఒకనాటి రాత్రి ఆ గ్రామ పెద్దకు వీరభద్రుడు ప్రత్యక్షమయి, కాశీకి వచ్చి అక్కడ ఉన్న తన విగ్రహాన్ని తీసుకువెళ్ళి ఆ వూళ్ళో ప్రతిష్ఠచేయమన్నాడట. తెల్లవారగనే ఆ గ్రామపెద్ద తతిమ్మావాళ్లతో ఈ సంగతి చెప్పి, ఎవరైనా యువకులు ఈ పనికి ముందుకు వస్తారా అని అడిగాడట. కాశీకి పోయినవాడూ కాటికి పోయినవాడూ ఒకటే అనే రోజులేమో, ఆ పనికి ఎవ్వరూ సాహసించలేదు. ఆఖరుకు ఒక 20 ఏళ్ళ యువకుడు ఆ విగ్రహాన్ని తీసుకువస్తానని బయలుదేరాడు. ఎలాగైతేనేం, నలభై ఏళ్ల వయసొచ్చేటప్పటికి కాశీ చేరాడు. చీకటి పడిందేమో ఆ రాత్రికి అక్కడ విగ్రహం దగ్గర పడుకొందామని మేను వాల్చాడు. అప్పుడు వీరభద్రుడు ఆ బ్రాహ్మడికి కల్లోకి వచ్చి 'నా విగ్రహాన్ని పుచ్చుకొని హశ్శరభ అన్నావంటే ఒక రాత్రి ఒక పగలు ప్రయాణం చేసేటప్పటికి మీ వూరు చేరతావు, కాని దారిమధ్యలో నన్నెక్కడా దింపవద్దు' అని చెప్పాడట. సరేనని ఆ రాత్రే ఆ విగ్రహాన్ని పుచ్చుకొని హశ్శరభ అని బయలుదేరాడట. చిత్రంగా తెల్లవారేటప్పటికి మా వూరు వచ్చాడు.

అక్కడ దారిలో అతడో చిన్న కాల్వ దాటాలి. ఆ కాల్వ చూచేటప్పటికి అతడికి సంధ్యావార్చుకొందామని బుద్ధిపుట్టిందట. వీరభద్రుడు చెప్పిన మాటలు మర్చిపోయి అక్కడే ఉన్న ఒక తాడిచెట్టుకు విగ్రహాన్ని ఆనించి సంధ్యచేసుకొని వచ్చి, "హశ్శరభ" అని మళ్ళీ విగ్రహాన్ని ఎత్తాడట. ఏముంది? ఆ విగ్రహం కదిలి వస్తేనా! అప్పుడు వీరభద్రుడు మళ్లీ ప్రత్యక్షమై 'నా ఆజ్ఞ నుల్లఘించావు. అయినా, నా రాక గమనించి బ్రహ్మరాక్షసి పారిపోయింది, నేను ఇక్కడే ప్రతిష్ఠ అవుతాను, కాని మీ వూరివైపే తిరిగి వుంటా' నని చెప్పాడట. అక్కడే ఒక గుడి కట్టారు. మా వూరు అక్కడ వెలిసింది.

తాడిచెట్టుకు ఆనుకొనివున్న దేవుని వలన వెలిసిన వూరు కావటంచేత "తాడువాయి" అయింది.

కొన్నాళ్ళకు మళ్లీ వీరభద్రుడు మా వూరి పెద్దకు కన్పడి, 'కోడికూత, రోకటిపోటు నాకు విన్పడగూడదు. కాబట్టి మీ వూరు ఇక్కడికి రెండుమైళ్ళ దూరంలో కట్టుకోండి' అని ఆజ్ఞాపించాడట. అందుకే మా వూరికీ దేవాలయానికీ రెండుమైళ్ళ దూరం. ఇక్కడ మహా శివరాత్రికి గొప్ప తీర్థం జరుగుతుంది. ఇప్పటికీ పాడుపడిపోయిన ఇళ్ల జాడలు ఆ దేవాలయ సమీపంలో మనం చూస్తాం. ఆ దేవుడి వెనుక ఇప్పటికీ తాటిమొద్దు ఉందని మా పూజారి అంటాడు.

—అద్దంకి అంజనీదేవి.

# మూఢులు

పూర్వం ఒక దేశంలో ఏడుగురు అన్నదమ్ములుండేవారు. వాళ్లు తండ్రి బతికి ఉన్నంత కాలమూ పొలంపని చేసుకుంటూ తమ గ్రామంలోనే ఉండిపోయారు. తరవాత వాళ్ళకి స్వాతంత్ర్యం వచ్చింది.

ఒకనాడు పని ఏమీ లేకపోయింది. చుట్టుపక్కల గ్రామాలు చూసి వద్దామని ఏడుగురూ బయలుదేరారు. రోజల్లా తిరిగారు. ఏది చూసినా వాళ్లకి వింతగానే కనబడింది. కొంతసేపు రహదారికేసి నోళ్లు తెరుచుకు చూశారు, కొంతసేపు చెట్లమీద తిరిగే కోతులను చూశారు, మరికొంతసేపు ఏదో గుడికేసి చూశారు.

పొద్దుగూకేవేళ వాళ్లు ఏడుగురూ ఇంటిదారి పట్టారు. ఆ దారి ఒక బావి పక్కగా ఉన్నది. బావి దాటి వచ్చినాక వాళ్లలో ఒకడు అందరినీ లెక్కించి చూసుకుని, "ఏడోవాడేడీ?" అన్నాడు. వాడు తనను తాను లెక్కించుకోలేదు. అలాగే అందరూ తమను తాము వదిలేసి మిగిలినవాళ్లనే లెక్కించి ఒకడు బావిలో పడిపోయి ఉంటాడని నిర్ధారణ చేసుకున్నారు.

ఒకడు వెళ్ళి బావిలోకి తొంగి చూసేసరికి అందులో వాడి ముఖం కనిపించింది. "ఇంకేం? ఏడోవాడు లోపల ఉన్నాడు!" అన్నాడు వాడు. "ఏదీ? చూడనీ!" అంటూ ఒక్కొక్కరే బావిలోకి తొంగి చూసి, ఏడోవాడు బావిలోపల ఉన్నట్టు నిర్ధారణ చేసుకున్నారు.

బావిలోకి దిగాలిగా! పెద్దవాడు బావి ఒడ్డు పట్టుకుని లోపలికి వేళ్లాడాడు. రెండోవాడు వాడి కాళ్లు పట్టుకుని వేళ్లాడాడు. ఇలా అందరూ ఒకరి కాళ్లు ఒకరు పట్టుకుని వేళ్లాడుతుంటే పెద్దవాడు బరువు భరించలేక పట్టు వదిలేశాడు. అందరూ లోపల పడిపోయి ఒకరినొకరు గట్టిగా పట్టుకుని, "దొరికాడు! దొరికాడు!" అని అరిచారు.

అదృష్టవశాత్తూ బావిలో నీరు చాలా కొంచెమే ఉన్నది. తరవాత వాళ్లు ఒరలు పట్టుకుని పైకెక్కి వచ్చారు. బావిలోకి దిగేటప్పుడు పడేసిన టోపీలన్నీ ఒకచోటే ఉన్నాయి. వాటిని లెక్కపెట్టుకుంటే ఏడున్నాయి.

"అమ్మయ్య! ఎవరమూ తప్పిపోలేదు! ఇంకా నయం!" అనుకుని వాళ్లు ఇంటికి వెళ్లిపోయారు.






## 4

ఛింఘిజ్ ఖాన్ వంశంవారు చనిపోతే వారి శవాలను అల్టాయ్ పర్వతంవద్ద పాతి పెట్టటం ఆచారం. వాళ్ళు ఆ పర్వతానికి నూరురోజుల ప్రయాణపు దూరంలో ఉన్నా సరే శవాన్ని అక్కడికి మోసుకుపోవాలి. దారిలో ఎదురైన వారందరినీ చంపి, "వెళ్లి లోకాంతరంలో పెద్ద ఖానుకు సేవ చెయ్యి," అనేవారు. అలాగే దారిలో కనిపించిన గుర్రాలన్నిటినీ ఆయనకోసం చంపేవారు. మొంగూ ఖాన్ చనిపోయినప్పుడు ఆయన శవానికి ఎదురైనవారిని ఇరవైవేలమందిని పెద్ద ఖాను అనుచరులు ఈవిధంగా చంపినమాట వాస్తవం. పెద్ద ఖాను చనిపోగానే ఆయనకు గల గుర్రాలలో ఉత్తమమైన వాటన్నిటినీ కూడా చంపటం ఆచారం.

ఈ సందర్భంలో తాతార్లను గురించి తెలుసుకోదగిన విషయాలు కొన్ని ఉన్నాయి. వాళ్ళు ఎప్పుడూ ఒకచోట ఉండక శీతాకాలాన ఉష్ణప్రాంతాలా, వేసవికాలాన చల్లని ప్రాంతాలా నివసిస్తారు. వాళ్ళ ఇళ్ళు చెక్కలతో గుండ్రంగా నిర్మించినవి; నాలుగు చక్రాల బళ్ళపైన ఎక్కించి తీసుకుపోవటానికి వీలుగా, చాలా తేలికగా ఉంటాయి. వర్షాకాలంలో వాళ్లు బళ్లలో ప్రయాణిస్తారు. ఈ సవారీ బళ్లలో ఒక్క చినుకు వర్షం కురవదు; వీటిలోనే వారి కాపరాలూ, వంట సామగ్రీ అన్నీ ఉంటాయి.



తాతార్ స్త్రీలే ఇంటి పనులూ, క్రయ విక్రయాలు చేస్తారు. వేటాడటమూ, యుద్ధం చెయ్యటమూ, డేగలతో వేటా మాత్రమే మగ వాళ్ళ పని. వారు గుర్రపు మాంసమూ, కుక్క మాంసమూ కూడా తింటారు. గుర్రపు పాలు తాగుతారు. పది, ఇరవైమందికూడా ఒకే కుటుంబంగా జీవిస్తారు. అయితే వారి మధ్య ఎట్టి వైషమ్యాలూ, పేచీలూ ఉండవు. పిల్లలను ఉమ్మడి సొత్తుగా చూస్తారు. తాతార్ పురుషులు పోషించగలిగితే నూరు మంది స్త్రీలనుకూడా పెళ్ళాడవచ్చు.

వారు సర్వేశ్వరుణ్ణి నమ్మి ధ్యానిస్తారు. ఈ సర్వేశ్వరుడు వివేకాన్నీ, దేహారోగ్యాన్నీ



పెంపొందిస్తాడని వారి నమ్మకం. తరవాత వారు గృహదేవతల విగ్రహాలను పెట్టుకుని పూజిస్తారు. భోజనం చేసేముందు ఆహారాన్ని గృహదేవతలకు నైవేద్యంపెడతారు.

వారు అసాధారణ శౌర్య సాహసాలు గలవారు. ఎటువంటి కష్టాలకైనా తట్టుకో గలవారు. ఆకలి దప్పులకు ఓర్చి, రోజుల తరబడి గుర్రం దిగకుండా వారు పోరు సాగించగలరు. యుద్ధరంగం నుంచి పారి పోవటం వారికి ఓటమి కాదు. పారిపోతూ కూడా వారు వెనక్కు తిరిగి తమను వెంటాడే శత్రువును బాణాలతో గురిగా కొట్టగలరు. ఈవిధంగా శత్రువును బలహీనపరిచి వారు యుద్ధంలో అంతిమ విజయం సాధిస్తారు. అందుచేతనే వారు యుద్ధాలు చేసి అంత ప్రపంచాన్ని స్వాధీనపరుచుకోగలిగారు. వారు దిగ్విజయం నిమిత్తం దూర ప్రయాణాలు చేసేటప్పుడు ఆహారం వెంట పట్టుకు పోరు. మరే ఆహారమూ లేకపోతే తమ గుర్రాల రక్తనాళాలనుంచి రక్తం తీసి దానిని తాగుతారు. వారి ప్రధాన సంపద గుర్రాలూ, ఒంటెలూ, ఎద్దులూ, ఆవులూ, గొర్రెలూనూ.

తాతార్లలో ఒక వింత ఆచారం ఉంది. ఒకడి కూతురూ, మరొకరి కొడుకూ చని పోయినప్పుడు, ఆ ఇద్దరి ఆత్మలకూ శాస్త్రో







క్తంగా వివాహం జరిపించి వారి తండ్రులు వియ్యమందుతారు! ఆ బంధుత్వం తర తరాల అలాగే ఉండిపోతుంది.

కాతేకు వెళ్ళే దారిలో పెద్దఖాను మకాములు చాలా ఉన్నాయి. "చగన్ నోర్" (తెల్ల మడుగు) అనేచోట పెద్దఖాను రాజసౌధం ఒకటి ఉన్నది. ఇక్కడ అనేక నదులూ, సరస్సులూ, వాటిలో హంసలూ, వేటాడదగిన అనేక పక్షులూ ఉంటాయి. వేటకోసం పెద్దఖాను ఇక్కడికి వచ్చి కొంత కాలం ఉంటూఉంటాడు.

షాంగ్-తు అనే నగరంలో మరొక పెద్ద హర్మ్యం ఉన్నది. దీనిని కుబిలాయిఖాన్ కట్టించాడు. ఈ మహాభవనాన్ని చలవరాతితోనూ, ఇతర అరుదైన శిలలతోనూ కట్టారు. భవనం లోపల అంతటా బంగారు పూత పూశారు, వైభవంగా అలంకరించారు. ఈ భవనం వెనక ఒక బ్రహ్మాండమైన ఉద్యానవనం ఉన్నది. అందులో పెద్దఖాను అచ్చగా వెదురు వాసాలతో ఇంకొక పెద్ద భవంతి కట్టించాడు. ఇదికూడా అత్యద్భుతంగా తయారుచేయబడినది. దీనిని కావాలంటే విప్పి పెట్టవచ్చుకూడానూ.

జూన్, జులై, ఆగస్టు మాసాలు ఆ ప్రాంతాన వేసవి కాలం. ఈ మూడు మాసాలూ పెద్దఖాను షాంగ్-తులో గడుపుతాడు. ఇక్కడ చల్లగా ఉంటుంది. ఆగస్టు 28 న పెద్దఖాను వెళ్ళిపోయేటప్పుడు వెదుళ్ళతో కట్టిన మహలును విప్పేస్తారు. పెద్దఖాను ప్రతి ఏడూ ఆగస్టు 28 నే ప్రయాణమయేవాడు. అది దైవజ్ఞులు నిర్ణయించిన ముహూర్తం.

పెద్దఖానుల వశంలో అతి పవిత్రంగా భావించబడే తెల్ల గుర్రాల మందలుండేవి. వాటి సంతతిలో ఏ ఒక్కదాని శరీరంపైనా ఆపగింజంత మచ్చకూడా ఉండేదికాదు. ఈ మందలలో ఆడగుర్రాలే పదివేలకు పైగా ఉండేవి.





కుబిలాయ్‌ఖాను వద్ద టిబెట్టు, కాశ్మీర దేశాలకు చెందిన తాంత్రికు లుండేవారు. వీరు పెద్దఖాన్‌పైన మాత్రం వర్షం పడకుండా చెయ్యగలిగేవారట. వీరు ఎప్పుడూ భస్మం ధరించి ఉండేవారనీ, బలవన్మరణం పొందిన శవాలను తీసుకుపోయి వాటితో క్షుద్రదేవతారాధన చేసేవారనీ మార్కో తెలుసుకున్నాడు.

కుబిలాయ్ వద్ద "బఖ్షీ" లని మరొక రకం మాంత్రికులుండేవారు. పెద్దఖాను భోజనానికి ఎత్తయిన వేదికపైన కూచునేవాడట. ఆయన కూచున్న బల్లకు పది అంగల దూరంలో నేలపైన లోటాలనిండా సారా, పాలూ, ఇతర పానీయాలూ ఉండేవట. అప్పుడు "బఖ్షీ"లు తమ మంత్రశక్తి చేత ఈ లోటాలన్నీ తమంతట తామే గాలిలో లేచి పెద్దఖాను వద్దకు వెళ్ళేలాగ చేసేవారట. పదివేలమంది సమక్షంలో వారీ శక్తులు ప్రదర్శించేవారట. ఇందులో అవగింజంత అయినా అబద్ధం లేదని మార్కో వచించాడు.

ఈ "బఖ్షీ"లు దేవతలకు ప్రియమైన దినాలు వచ్చినప్పుడు పెద్దఖాను సహాయంతో గొప్పగా ఉత్సవాలు చేసేవారు. వారు తమతమ హోదానుబట్టి భార్యలను కూడా చేసుకునేవారు. కాని "సియెన్-సెంగ్" అనే మరొక రకంవారు సన్యాసులు. వారు తలలు గొరిగించుకుని, ధాన్యం పై పొట్టుమాత్రమే తిని, ఉపవాసాలతో జీవిస్తూ బ్రహ్మచర్యం అవలంబించేవారు. నలుపు, నీలిరంగులు గల నారబట్టలు ధరించేవారు. ఎప్పుడైనా పట్టుబట్టలు కట్టినా, ఆ రంగులు కలవే కట్టేవారు. వీరు శక్తి ఉపాసకులై ఉండవచ్చు, ఎందుకంటే వారు ఆరాధించే దేవతల పేర్లన్నీ ఆడవేనట. ప్రపంచంలో అంత కఠోరమైన జీవితం గడిపేవారు మరెక్కడా ఉండరని మార్కో భావించాడు. —(ఇంకావుంది)



# గలివర్ యాత్రలు



బ్లెఫుస్కు యుద్ధనావలలోని సైనికులు ఆ భయంనుంచి కోలుకునే లోపల నేను రేవులో ఓడల లంగర్లు తీసేశాను.



అంతలోనే పందలకొద్దీ బాణాలు వర్షపు జల్లులాగా వచ్చి పడ్డాయి. చిన్నవే అయినా చాలా బాధ కలిగించాయి.



బ్లెఫుస్కు సైనికులు ప్రయోగించే ఆ బాణాల వల్ల కళ్ళకు హాని కలగకుండా వుండేందుకు జేబులోని కళ్ళజోడు తీసి పెట్టుకున్నాను.



అక్కడున్న వాటిలో చాలా పెద్దవైన యాభై యుద్ధనౌకల పగ్గాలు గుదిగుచ్చి పట్టుకుని లిల్లిపుట్ రాజ్యంవైపు సాగిపోయాను.



లిల్లిపుట్ తీరం సమీపించేముందు కళ్ళజోడు తీసి జేబులో పెట్టేసుకున్నాను. నేను ఒడ్డు చేరేసరికి చక్రవర్తి, ఆయన పరివారం, ప్రజలు వేలాదిగా అక్కడ నిలిచి ఎదురు చూస్తున్నారు. "లిల్లిపుట్ చక్రవర్తికి జయము జయము!" అని వందనం చేశాను.





చక్రవర్తి నా రాజభక్తిని అనేకవిధాల మెచ్చు కున్నారు. దేశమంతటికీ గొప్పదైన 'నార్డాక్' అన్న బిరుదాన్ని ప్రసాదించి సత్కరించారు.

వీలువెంట బ్లెఫుస్క్యూలో మిగిలి వున్న ఓడ లన్నిటినీ కూడా లాక్కొచ్చెయ్యమని చక్రవర్తి అన్నారు. రాజ్యకాంక్షకి అంతుండదుకదా!



బ్లెఫుస్క్యూను సామంతరాజ్యం చేసుకోవాలని దురాశపడ్డాడు రాజు. ప్రజలను బానిసలను చేయడం సుతరామూ నాకిష్టంలేదని చెప్పేశాను.



మంత్రివర్గంలోని కొందరు పెద్దలుకూడా నా మాట మన్నించి ఆ ఉద్దేశం తగదని చక్రవర్తికి నచ్చచెప్పారు.



రాజుగారు నొచ్చుకున్నట్టు కనబడ్డారు. కానీ ఏమీ అనకుండా అక్కడనుంచి గంభీరంగా లేచి వెళ్ళిపోయారు.



మూడువారాల తరువాత బ్లెఫుస్కు దేశం నుంచి ఒక పెద్ద రాయబారవర్గం వచ్చింది. లిల్లిపుట్ చక్రవర్తి స్నేహం కోరి వారు సంధికి వచ్చారు. అన్నివిధాలా తనకు అనుకూలమైన షరతులతో చక్రవర్తి సంధి పత్రాలు రాయించారు.



తరువాత ఆ రాయబారులు నన్ను చూడడానికి వచ్చారు. నన్నూ, నా శక్తి సామర్థ్యాలనూ వేనోళ్ళ మెచ్చుకున్నారు.



"మీరు మా రాజ్యానికి ఒకమారు దయచేయవలసింద"ని తమ చక్రవర్తి మాటగా నన్ను ఆహ్వానించారు. నేను అంగీకరించాను.



ఆ తరవాత ఒక రోజున చక్రవర్తిగారి దర్శనం సంపాదించి బ్లెఫుస్కూ రాజు ఆహ్వానం మనవిచేసి వెళ్ళడానికి అనుమతి కోరాను. చక్రవర్తిగారు ముభావంగా వుండి తుదకు సరే అన్నారు. ఆయనకి నాపట్ల అభిమానం తగ్గిపోయిందని తోచింది.



ఇలావుండగా, ఒకనాటి అర్ధరాత్రివేళ నా స్నేహితుడైన రాజోద్యోగి ఒకాయన రహస్యంగా నా వద్దకు వచ్చాడు.





నాకు ఒక పెద్ద ఆపద వాటిల్లబోతోందని హెచ్చరించాడు. "అసలే మీపట్ల విముఖులైవున్న చక్రవర్తికి, మీరంటే గిట్టనివాళ్ళు లేనిపోనివి కల్పించి చెప్పారు. బ్లెఫుస్కూ రాయబారులతో మాట్లాడ్డమే నేరమని, పైగా ఆ దేశం వెడతాననడం రాజద్రోహమేననీ చెప్పారు. మిమ్మల్ని వెంటనే వధించాలని తీర్మానించారు. కానీ రాజుగారు మీమీద దయతలచి మీరు చేసిన సహాయం తలచి కళ్ళుమాత్రం తీయించి వేయాలని నిశ్చయించారు. ఏ క్షణంలోనైనా ఆపద వాటిల్లవచ్చు.



"నేను చెప్పదలచుకున్నది చెప్పాను. చెయ్యగలిగిందేమీ లేదు కర్తవ్యం మీరే ఆలోచించుకోండి," అని చెప్పి నా మిత్రుడు వెళ్ళిపోయాడు.



తెల్లవారేసరికి నా బట్టలన్నీ ఒక పెద్ద ఓడలో పడేసి, నేను బ్లెఫుస్కూ వెడుతున్నట్లు చక్రవర్తికి కబురుపెట్టి బయలుదేరాను.




# నిరక్షరకుక్షులు

భోజరాజు పరిపాలనకింద ధారానగరంలో హీనజాతివారు సయితం ఒకవంక అద్భుతమైన కవిత్వం చెప్పగలిగితే, మరొకవంక పొట్టపొడిచినా అక్షరంలేని బ్రాహ్మలు కూడా ఉండేవారు. వీరిలో కొందరు కాళిదాసు దగ్గిరికి వెళ్ళి, రాజుచేత బహుమానం ఇప్పించమని వేధించేవారు. కాళిదాసు ఇటువంటి వారిని రాజసభకు తీసుకుపోయి తన ప్రజ్ఞాబలంచేత వారిని పండితులుగా ప్రదర్శించి, బహుమానా లిప్పిస్తూండేవాడు.

ఇటువంటివాడే కేశవశర్మ అనేవాడొకడు కాళిదాసు పాలపడ్డాడు. ఈ కేశవశర్మకు చదువు కొంచెమైనా అబ్బలేదు, కాని దురభ్యాసాలన్నీ అలవడ్డాయి. వాటితో అతను తనకున్నదంతా తగలేసుకుని, తిండికికూడా లేని స్థితిలో కాళిదాసువద్దకు వెళ్లి, "ఏవిధంగానైనా రాజుచేత బహుమానం ఇప్పించాలి!" అని ప్రాధేయపడ్డాడు.

"నువ్వేం చదువుకున్నావు?" అని అడిగాడు కాళిదాసు. కాని కేశవశర్మ ఏమీ చదువుకోలేదు. ఏదన్నా చదువుకున్నా అంతా ఏనాడో మరిచిపోయాడు.

"సరే, వెళ్లు. రేపు సభకు రా. వస్తూనే ఏదో ఒకటి అనాలి గనక, అధమం నక్షత్రాల పేర్లు ఏకరుపెట్టి మరి మాట్లాడక కూచో: నీకు ఎంతో కొంత ముట్టేట్టు నేను చూస్తాను!" అన్నాడు కాళిదాసు.

ఆప్రకారమే కేశవశర్మ మర్నాడు రాజసభకు వచ్చాడు. ఆతను కనిపించగానే కాళిదాసు లేచి వందనం చేశాడు.

"ఆ వచ్చేవారెవరు?" అని రాజు కాళిదాసు నడిగాడు. "అయన చాలా గొప్ప విద్వాంసుడు! తరుచు మౌనదీక్ష పట్టి ఉంటారు!" అన్నాడు కాళిదాసు.

వెంటనే భోజరాజు లేచి, కేశవశర్మకు నమస్కారం చేసి ఒక ఆసనం చూపించాడు.



కనీసం నక్షత్రాల పేర్లుకూడా రాని ఆ మూర్ఖుడు, "అశ్వనీ. పునర్వసు, రేవతీ, కృత్తికా!" అని కూచున్నాడు.

ఇది విని రాజు నిర్ఘాంతపోయాడు. అయితే కాళిదాసు, సమయస్ఫూర్తి గల వాడు గనక, "ఆహా హా! ఎంత గొప్ప ఆశీర్వచనం!" అన్నాడు.

"విద్వాంసులవారి ఆశీర్వచనం నాకు బోధపడలేదే?" అన్నాడు భోజరాజు.

"వారి ఉద్దేశం ఇదీ!" అంటూ కాళిదాసు ఈ శ్లోకం చదివాడు:

"అశ్వని భవతు తేతు మందురా,
మందిరే వసతు తే పునర్వసు,
రేవతీ పతి కనిష్ఠ సేవయా
కృత్తికా తనయ విక్రమో భవ!"

[నీ గుర్రపుసాల గుర్రాలతో నిండి ఉండు గాక. నీ ఇంట బంగారం ఇంకా ఇంకా ఉండుగాక. రేవతిదేవి భర్త (బలరాముడి) యొక్క తమ్ముడి (కృష్ణుని) సేవవలన కృత్తికా తనయుడి (కుమారస్వామి) వలె పరాక్రమవంతుడి వవుదువుగాక!]

భోజరాజు చాలా సంతోషించి కేశవశర్మకు మంచి బహుమానం ఇచ్చి పంపాడు.

మరొక సందర్భంలో కాళిదాసుకు ఇంత కన్న తీవ్రమైన పరీక్ష జరిగింది. "ఎవరో కాళిదాసు గురువుగారట. రాజవీథిలో కూచున్నారు!" అని ధారానగరం ప్రజలు చెప్పుకోసాగారు. ఈ వార్త భోజరాజుదాకా పోయింది. అయన కాళిదాసును "మీ గురువు గారు ఊళ్లోకి వచ్చారట. వెళ్లి దర్శనం చేసుకున్నారా?" అని అడిగాడు.

నిజానికి కాళిదాసుకు గురువెవరూ లేడు. అందుచేత రాజుతో ఏం చెప్పటానికీ పాలుబోక కాళిదాసు, "నేనుకూడా విన్నాను. అయన దర్శనం చేసుకుందామనుకుంటున్నాను!" అని సమాధానం చెప్పాడు.

తరవాత కాళిదాసు, తన గురువని చెప్పుకునే మనిషిని వెతుక్కుంటూ వెళ్లి,

"ఏమయ్యా, నువు కాళిదాసు గురువునని చెప్పుకుంటున్నావుట. నీ మోసం కాళి దాసుకు తెలిస్తే ఏమవుతుందో ఆలోచించు కున్నావా?" అని గద్దించి అడిగాడు.

వెంటనే ఆ వేషధారి బెదిరిపోయి, "అయ్యా, ఇది నా తప్పు కాదు. నేను పొట్ట గడవని పేద బ్రాహ్మణ్ణి. భోజరాజు ఆస్థానంలో ఉండే విష్ణుశర్మ అనే పండితుణ్ణి పోయి యాచిస్తే, ఇలా వేషం వేసుకుని కూచోమన్నాడు. ఇలా చేస్తే నాకు గొప్ప బహుమతి లభిస్తుందన్నాడు," అని అసలు విషయం బయటపెట్టాడు.



ఈ విష్ణుశర్మకు కాళిదాసుపై అసూయ. తనకు అవమానం తీసుకు రావటానికే ఆ విష్ణుశర్మ ఈ బ్రాహ్మడిచేత ఈ పని చేయించి ఉంటాడని కాళిదాసు గ్రహించాడు. ఈ బ్రాహ్మణ్ణి గురించి నిజం బయట పెడితే బ్రాహ్మడి ఆశ నిరాశ అవుతుందే గాని విష్ణు శర్మకు కొంచెంకూడా నష్టం కలగదు. బ్రాహ్మడి ఆశ ఫలించి, విష్ణుశర్మ ఆశ నిరాశ కాగలందులకు కాళిదాసు ఒక ఉపాయం ఆలోచించి, బ్రాహ్మడితో ఇలా అన్నాడు: "జరిగినదేదో జరిగిపోయింది. కాళిదాసు గురువు వచ్చాడన్న వార్త రాజు దాకా వెళ్లింది. అందుచేత ఆయన పిలిచి నీకు అతిథ్యమూ, అర్చనా చేస్తారు. ఆ సమ యంలో నువు నోరు విప్పావో నీ రహస్యం బయటపడుతుంది. నిన్ను తప్పక కొరత వేస్తారు. ఒకవేళ రాజు నిన్నేమైనా అడిగినా, సమాధానం చెప్పక నన్ను చూపు. నేను ఏదో చెప్పి, నీకేదైనా లాభం కలిగేట్టు చూస్తాను."

తరవాత కాళిదాసు భోజరాజుతో, తన గురువు దర్శనం చేసుకున్నట్టు చెప్పి, ఆయన మౌనవ్రతం పట్టి ఉన్నాడని తెలియ జేశాడు. భోజరాజు పరమానందం పొంది, కాళిదాసుమీద తనకు గల ప్రేమాభిమానాల కొద్దీ "కాళిదాసు గురువు" కోసం పల్లకీ పంపి రాజసభకు పిలిపించాడు. సభలో అందరూ

"కాళిదాసు గురువు"ను ఎగబడి చూడ సాగారు. కాళిదాసుకు మంచి పరాభవం జరుగుతుందని విష్ణుశర్మ సంతోషించాడు.

ఆ సభలో ఆ సమయాన "రావణుడు" అనే మాట ఎలా వచ్చిందన్న విషయం చర్చ జరుగుతోంది. కైలాసం ఎత్తబోయి దానికింద పడి ఏడవటంవల్ల "రావణుడు" అనే పేరు వచ్చిందని కొందరూ, మరొక కారణంచేత వచ్చిందని మరికొందరూ అంటున్నారు. భోజరాజు "కాళిదాసు గురువు"కేసి తిరిగి, "స్వామీ, మీరెరగనిది లేదు. రావణ శబ్దానికి సరి అయిన వ్యుత్పత్తి ఏమిటి?" అని అడిగాడు.

ఆ మూర్ఖ బ్రాహ్మణుడు నోరు మూసుకో వాలన్న మాట మరిచిపోయి, "ఆ రాభణుడా?" అని తల ఆడించాడు.

భోజరాజు నిర్ఘాంతపోయి, "స్వామీ, రావణుడనటానికి బదులు తమరు రాభణుడన్నారు కారణమేమిటి?" అని అడిగాడు.

వెంటనే కాళిదాసు లేచి, ఇలా చెప్పాడు: "మహారాజా! గురువుగారి ఉద్దేశం తమ రూహించలేకపోయారు. మనం రావణశబ్దం సరి అయినదని ఇంతసేపూ చర్చిస్తున్నాం. ఆ శబ్దం 'రాభణుడు' ఎందుకు కాకూడదని గురువుగారి అభిప్రాయం. ఎందుకంటే—

"భకారః కుంభకర్ణే చ,
భకారశ్చ విభీషణే,
తయోర్జ్యేష్ఠే, కులశ్రేష్ఠే
భకారః కిం నవిద్యతే ?"

[కుంభకర్ణుడి పేరులో భకారం ఉన్నది. విభీషణుడి పేరులో భకారం ఉన్నది. ఈ ఇద్దరికన్న పెద్దవాడూ, కులశ్రేష్ఠుడూ అయిన వాడి (రావణుడి) పేరులో భకార మెందుకుండదు?]

కాళిదాసు చెప్పిన గూఢార్థం గురువుగారి మాటల్లో ఉందనుకుని సంతోషించి, భోజ రాజు ఆ బ్రాహ్మణుడికి గొప్ప సత్కారం చేసి పంపేశాడు.



# చిత్తోడ్ జయస్తంభం




భారతదేశ చరిత్రలో చిత్తోడ్‌ఘర్ అతి ముఖ్యమైన ప్రాచీన నగరం. క్రీస్తుశకం 728 లో ప్రసిద్ధ రాజపుత్ర వీరుడైన బప్పా రావల్ ఈ నగరాన్ని స్థాపించాడు. రాజపుత్ర శౌర్య పరాక్రమాలకూ, వికాసానికీ, సంస్కృతికీ ఇది దీర్ఘకాలం నిలయంగా ఉండింది. మొగలులను రాజపుత్రులు ప్రతిఘటించటానికి ఇదే కేంద్రంగా ఉండేది. కాని కాలక్రమాన ఇది మొగలుల చేత విధ్వంసం చేయబడింది.

రాజా భీమసింగ్, జగదేకసుందరిగా ప్రసిద్ధి గన్న ఆయన భార్య పద్మినీ ఇక్కడి వారే. తన కీర్తనలను దేశమంతటా వ్యాపింపజేసి వాటిద్వారా అమరత్వం సంపాదించిన మీరాబాయి కట్టించిన కృష్ణాలయమూ, ఆమె భర్త అయిన కుంభరాణా కట్టించిన మరొక ఆలయమూ ఇక్కడ ఉన్నాయి.

ఇక్కడి కట్టడాలలో చెప్పుకోదగినది జయస్తంభం. మాల్వా సుల్తానయిన మహమ్మద్ ఖిల్జీ చిత్తోడ్‌పైకి యుద్ధానికి వచ్చి యుద్ధంలో దెబ్బతిని తిరిగి వెళ్లాడు. 1440లో ఈ విజయానికి చిహ్నంగా కుంభరాణా ఈ జయస్తంభాన్ని నిర్మింపజేశాడు. దీని ఎత్తు 122 అడుగులు.



# దేహశుద్ధి

ఒక గ్రామంలో ఒక రైతుండేవాడు. ఆయనకు రాఘవులు అని ఒక కొడుకుండేవాడు. రైతుకు కొడుకుమీద కొంచెంకూడా ప్రేమ లేదు. ఆయన వాణ్ణి కర్కోటకుడల్లే చూసేవాడు. వాడిచేత చచ్చేటట్టు పొలంపనీ, దొడ్డిపనీ చేయించేవాడు. రాఘవులు మంచి పనిమంతుడు. అయితే ఏం లాభం? వాడు ఎంత పని చేసినా, చేసిన పని ఎంత బాగా చేసినా మెప్పు ఉండేదికాదు. వాడు పని జాస్తిగా చేసినకొద్దీ తండ్రి వాడికి మరింత పని కల్పించేవాడు.

రాఘవులుండే ఊళ్ళోనే రామి అనే ఒక పేదవాళ్ళ పిల్ల ఉండేది. రామికూడా రాఘవులల్లేనే బుద్ధిమంతురాలూ, పనిమంతురాలూనూ. వాళ్ళిద్దరికీ మనసులు కలిశాయి. పెళ్ళి చేసుకుందా మనుకున్నారు. పెళ్ళికి రామి తండ్రి ఒప్పుకున్నాడు. రాఘవులు తన తండ్రికి తన ఉద్దేశం తెలిపాడు.

"నిన్నే పోషించలేక చస్తుంటే నీ బతుక్కుతోడు ఒక పెళ్ళాన్నికూడా తెస్తావా? అదేమీ కుదరదు. నన్ను చిల్లిగవ్వ అడగకుండా పెళ్ళాన్ని పోషించుకోగలిగిననాడు పెళ్ళి చేసుకుందువుగానిలే!" అన్నాడు రాఘవులు తండ్రి.

తన తండ్రికింద చేసే వెట్టిచాకిరి ఇంకెక్కడన్నా చేసుకుంటే తాను పెళ్ళాన్ని పోషించుకోవచ్చునని రాఘవులుకు తోచింది. వాడు ఒకనాడు తండ్రితో చెప్పకుండా ఇల్లు విడిచి దేశాలమీద బయలుదేరాడు. తాను ఇలా పోతున్నట్టు ఒక్క రామికి మాత్రమే చెప్పాడు.

పోగాపోగా ఒక అడవి వచ్చింది. ఆ అడవిలో ఒక అవ్వ కనిపించింది. ఆ అవ్వ నెత్తిన కట్టెలమోపు ఉన్నది.

"అవ్వా, అవ్వా! పెద్దదానివి, నువు మొయ్యలేవు. ఆ మోపు ఇటియ్యి, మీ ఇంటి

టి. సూర్యనారాయణ

దాకా దాన్ని మోసుకువచ్చి పడేస్తాను," అన్నాడు రాఘవులు.

"ఏవూరు, నాయనా? నీ పేరేమిటి? ఎక్కడికి ప్రయాణమై పోతున్నావు?" అని అడిగింది అవ్వ, తన నెత్తిమీది మోపు రాఘవులు కిచ్చి.

రాఘవులు అవ్వకు తన కథ అంతా చెప్పి, "ఎక్కడన్నా పని చూసుకుందామని వెళుతున్నాను, అవ్వా. నాలుగు డబ్బులు చేర్చినాక, మావూరుపోయి రామిని పెళ్లి చేసుకుంటాను," అన్నాడు.



"అయితే ఎక్కడికో పోవటం దేనికి, రాఘవులూ? మా యింటో పనిచెయ్యి. పని చేసినన్నాళ్ళూ తిండి పెట్టి, ఏడాది అయినాక నాకు తోచినది ముట్టజెప్పుతాను," అన్నది అవ్వ.

"అట్లాగేకానీ, అవ్వా! పెద్దదానివి నీకు సేవ చేస్తే ఇంత పుణ్యంకూడా ఉంటుంది," అన్నాడు రాఘవులు.

రాఘవులు ఏడాదిపాటు అవ్వ దగ్గిర పని చేశాడు. పశువులకు మేతా, నీరూ పెట్టటమూ, పాలు పితకటమూ, దొడ్లో కూరగాయలు పెంచటమూ, అడవిలో కట్టెలు కొట్టి తేవటమూ మొదలైన పనులన్నీ వాడు ఎంతో శ్రద్ధగా, ఒళ్లు దాచుకోకుండా చేశాడు.

అవ్వ వాడికి మూడు పూటలా సుష్టుగా భోజనం పెట్టింది. ఏడాది పూర్తికాగానే ఆమె వాడితో, "రాఘవులూ, ఏడాదిపాటు చెప్పిన పని చక్కగా చేశావు. నీకు ఏదైనా ఇచ్చి మరీ పంపుతాను అన్నానుగద! నా దగ్గిర ఉన్న గాడిదను తీసుకుపోయి సుఖంగా జీవించు," అన్నది.

రాఘవులు తెల్లమొహం వేశాడు. గాడిద తనకు ఎందుకు ఉపయోగిస్తుంది? దాన్ని మేపటం ఎలాగు? ఏ చాకలికైనా అమ్మితే రెండు రూపాయలు రావచ్చు. కాని దానితో తను భార్యను ఎలా పోషిస్తాడు? అవ్వ తనను మోసంచేసింది!



వాడి మొహంలో నిరాశ చూసి అవ్వ నవ్వి, "పిచ్చివాడా, నీచేత ఇంతకాలం పని చేయించుకుని మామూలు గాడిదను ఇచ్చి పంపుతానా? దాని రెండు చెవులూ పట్టి గట్టిగా లాగి చూడు ఏం జరుగుతుందో, నీకే తెలుస్తుంది!" అన్నది.

చెవులు పట్టి లాగగానే గాడిద, "హా-హీ! హా-హీ!" అని ఓండ్రపెట్టసాగింది. అది అలా ఓండ్రపెట్టినప్పుడల్లా ముత్యాలూ, రత్నాలూ రాలాయి. వాటిని చూసి రాఘవులు పరమానంద భరితుడై, అవ్వకు నమస్కారం చేసి, ఆ గాడిదనే ఎక్కి తన స్వగ్రామానికి బయలుదేరాడు.

వాడు ఒక ఊరు చేరేసరికి పొద్దుగూకింది. వాడు పేదరాసి పెద్దమ్మ ఇంటికి వెళ్ళి, "పెద్దమ్మా, పెద్దమ్మా, ఈ రాత్రికి భోజనం పెట్టు, ఇక్కడే పడుకుని రేపు ఉదయం నా దారిన నేను పోతాను," అన్నాడు.

పెద్దమ్మ కొడుకు రాఘవులు గాడిదను తీసుకుపోయి ఇంటి బయట కొబ్బరి చెట్టుకు కట్టేశాడు.

రాఘవులు భోజనం చేసి పడుకోబోతుండగా పేదరాసి పెద్దమ్మ, "నాయనా, నువు మళ్ళీ చీకటితోనే బయలుదేరతావో ఏమో, నాకివ్వవలిసిన వరహా ఇప్పుడే ఇచ్చేస్తావేమిటి?" అన్నది.

"కొంచెం ఉండు, పెద్దమ్మా, ఇప్పుడే డబ్బు తెస్తాను," అంటూ రాఘవులు బయటికి వెళ్ళి, తన గాడిద చెవులు పట్టి గట్టిగా లాగాడు. గాడిద "హా-హీ, హా-హీ!" అని ముత్యాలూ, రత్నాలూ రాల్చింది.

రాఘవులు ఇంటి లోపలికి వచ్చి పేదరాసి పెద్దమ్మకొక ముత్యం ఇచ్చి, "బీద దానివి, ఉంచుకో!" అన్నాడు.

జరిగినదంతా పెద్దమ్మ కొడుకు చూశాడు. రాఘవులు నిద్రపోయినాక వాడు లేచి వెళ్ళి, కొబ్బరిచెట్టుకు కట్టిన గాడిదను విప్పి దూరాన కనపడకుండా కట్టేసి మరొక గాడి

దను తెచ్చి కొబ్బరి చెట్టుకు కట్టేశాడు. తరవాత వాడు రాఘవులు బట్టలు తడివి, వాడు మూటగట్టుకున్న ముత్యాలనూ, రత్నాలనూ కూడా లాగేశాడు.

రాఘవులు తెల్లవారుజామునే లేచి కొబ్బరి చెట్టుకు కట్టిఉన్న గాడిదను ఎక్కి ఇంటికి వెళ్లిపోయాడు. వాడు తండ్రితో తాను సంపాదించిన గాడిద సంగతి చెప్పి, "దాని చెవులు గట్టిగా లాగి చూడు, నీకే తెలుస్తుంది!" అన్నాడు.

రైతు తన కొడుకు చెప్పినట్టే చేశాడు. గాడిద "హీ-హా!" అన్నది, కాని ముత్యాలు రాల్చటానికి బదులు రైతును వెనక కాళ్లతో మొహం పగిలేటట్టు తన్నింది.

"ఛీ, బుద్ధిలేని గాడిదా! నిన్ను ఎవరో బాగా టోపీలో వేశారు! నా కళ్ళ ఎదట కనిపించకు!" అని రాఘవులును తండ్రి గట్టిగా తిట్టాడు.

ఇంత మోసం ఎలా జరిగిపోయినదీ రాఘవులుకు అంతు చిక్కలేదు. వాడు మళ్ళీ ఎక్కడైనా పని చేసుకోవటానికి బయలుదేరాడు. పోగాపోగా ఒక అడవి వచ్చింది. ఆ అడవిలో ఒక వడ్రంగి కొయ్యపలకలు చెక్కి వాటిని ఒక కట్టగట్టి తీసుకుపోతూ కనిపించాడు.




"తాతా, తాతా! పెద్దవాడివి, వాటిని నువ్వెక్కడ మోస్తావు? నాకియ్యి, మీ ఇంటిదాకా తెచ్చి నా దారిన నేను పోతా!" అన్నాడు రాఘవులు. వడ్రంగి రాఘవులు సమాచారమంతా విని తనకింద సంవత్సరం పాటు పనిచేస్తే తనకు తోచినది ఇస్తానన్నాడు. రాఘవులు సరేనని ఏడాదిపాటు వడ్రంగికి అన్నివిధాలా తోడ్పడ్డాడు. వాడు వెళ్లిపొయ్యేటప్పుడు వడ్రంగి ఒక కంచుపళ్లెం ఇస్తూ, "ఇది మామూలు కంచం కాదు. 'అన్నం పెట్టవే, కంచమా!' అని ఎవరన్నా అంటే చాలు పంచభక్ష్యపరమాన్నాలిస్తుంది," అన్నాడు.

రాఘవులు ఆ కంచాన్ని తన ముందు పెట్టుకు కూచుని, "అన్నం పెట్టవే కంచమా!" అన్నాడు. వెంటనే కంచంనిండా అన్నమూ, కూరలూ, భక్ష్యాలూ సిద్ధమయాయి. వాడు వాటినన్నిటినీ ఆరగించి, వ్రడంగికి నమస్కారం చేసి కంచం చంక పెట్టుకుని బయలుదేరాడు.

వాడు వెనకటిలాగే పేదరాసి పెద్దమ్మ ఉండే ఊరికి వచ్చేసరికి పొద్దు వాలింది. వాడు పేదరాసి పెద్దమ్మ ఇంటికి వెళ్ళి పెద్దమ్మతో, "ఈ రాత్రికి ఇక్కడ పడుకుని రేపు తెల్లవారగానే నా దారిన పోతాను, పెద్దమ్మా!" అన్నాడు.

"భోజనమో, నాయనా?" అన్నది పేదరాసి పెద్దమ్మ.

"నా దగ్గిర భోజనం పెట్టే కంచం ఉందిలే, పెద్దమ్మా," అంటూ రాఘవులు తన కంచం తీసి, "అన్నం పెట్టవే కంచమా!" అన్నాడు. దానిలోకి వచ్చిన భోజనం రాఘవులూ, పెద్దమ్మా, పెద్దమ్మ కొడుకూ తిన్నతరవాతకూడా ఇంకా చాలా మిగిలిపోయింది.

పెద్దమ్మ కొడుకు ఒక రాత్రివేళ లేచి, రాఘవులు నిద్రపోతూండగా, అతని కంచం కాజేసి, దాని స్థానంలో అటువంటిదే మరొక కంచం పెట్టాడు. రాఘవులు దాన్ని తీసుకు



పోయి తండ్రికి చూపి, "ఈసారి నేనేం తెచ్చానో చూడు!" అంటూ కంచం బయటికి తీసి, "అన్నం పెట్టవే, కంచమా!" అన్నాడు. కాని కంచం ఖాళీగానే ఉండిపోయింది. వాడు అన్నం పెట్టమని ఎన్నిసార్లు కేకలుపెట్టినా అది వినిపించుకోలేదు.

మళ్లీ రాఘవులు పని చూసుకోవటానికి బయలుదేరి వెళ్ళాడు. పోగాపోగా ఒక వాగు వచ్చింది. ఆ వాగు ఒడ్డున ఒక పెద్ద చెట్టున్నది. ఒక వయసు మళ్లినవాడొకడు దానిని గొడ్డలితో కొట్టుతున్నాడు.

"ఎందుకా చెట్టును పడగొట్టుతున్నావు, పెద్దయ్యా?" అన్నాడు రాఘవులు.

"వాగుకు వంతెనకోసంరా, బాబూ!" అన్నాడు వయసు మళ్ళినవాడు.

"ఆ గొడ్డలి ఇట్లా ఇయ్యి," అని రాఘవులు బలంగా పది దెబ్బలు వేసి, చెట్టు వాగుకు అడ్డంగా పడేటట్టు కొట్టాడు.

ఆ మనిషి రాఘవులు చేతినుంచి గొడ్డలి తీసుకుని, "మంచి సహాయం చేశావురా, బాబూ. నీ కష్టానికి ప్రతిఫలం ఇంద!" అంటూ చెట్టుకొమ్మ ఒకటి రెండు నరుకులు నరికి చేతికర్రలాగా తయారుచేసి ఇచ్చాడు.

రాఘవులు మర్యాదకోసం ఆ కర్ర తీసుకుని ముందుకు సాగబోతుండగా ఆ వయసు మళ్ళినవాడు, "చూడరా, బాబూ, అది



మామూలుకర్ర అనుకునేవ్. నువు దానితో ఎవరిని కొట్టమంటే వాళ్ళను కొడుతుంది. అందుచేత అది నీకు అన్నివిధాలా ఉప యోగం!" అన్నాడు.

రాఘవులు ఈ మాటలకు ఆశ్చర్యపడి, "గాలిని కొట్టవే, కర్రా!" అన్నాడు. వెంటనే ఆ కర్ర వాడి చేతినుంచి దూసుకుపోయి గాలిని బాదసాగింది. రాఘవులు ఆ కర్రను మళ్లీ చేతికి తీసుకున్నాడు.

వాడు తాపీగా ఆలోచించేసరికి పేదరాసి పెద్దమ్మ ఇంటోనే తన గాడిదా, కంచమూ మార్పిడి జరిగి ఉండాలని తట్టింది. వెంటనే వాడు ఆ గ్రామం వెళ్ళాడు.

"ఏం, పెద్దమ్మా! బాగున్నావా?" అని అడిగాడు రాఘవులు.

"నిన్నెప్పుడూ చూసినట్టు లేదే, నాయనా!" అన్నది పేదరాసి పెద్దమ్మ.

"అవును, మనం ఈ అబ్బాయినెప్పుడూ చూడలేదు," అన్నాడు పెద్దమ్మ కొడుకు.

"నా గాడిదనూ, కంచాన్నీ మీరు దొంగిలించారు. ఇప్పుడైనా జ్ఞాపకం వచ్చానా?" అన్నాడు రాఘవులు.

"మేము నీ సొత్తేమీ కాజెయ్యలేదు," అన్నాడు పెద్దమ్మ కొడుకు.

"వాణ్ణి తన్నవే, కర్రా!" అన్నాడు రాఘవులు. వెంటనే వాడి చేతికర్ర గాలిలో ఎగురుతూ వచ్చి పెద్దమ్మ కొడుకుకు గట్టిగా దేహశుద్ధి చేసింది.

"క్షమించు, నాయనా! నేరక, బుద్ధి గడ్డి తిని నీ సొత్తు కాజేశాం! నీ వస్తువులు నువు పట్టుకు పో! నా కొడుకును కాపాడు!" అని పేదరాసి పెద్దమ్మ మొరపెట్టినమీదట రాఘవులు, "రావే, కర్రా!" అన్నాడు.

తరవాత రాఘవులు తన గాడిదమీద ఎక్కి, తన కంచాన్నీ కర్రనూ వెంటబెట్టుకుని స్వగ్రామం చేరి రామిని పెళ్ళాడి, ఏ లోటూ లేకుండా చాలా కాలం సుఖంగా జీవించాడు.



# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1960 సెప్టెంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జులై నెల 10-వతేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జులై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మిత్రులు పోరి చెడకండి

రెండవ ఫోటో : శత్రువు బారి పడకండి

పంపినవారు : వాసా సుశీల, c/o వి. అన్నాజీరావు,

R. W. S. ఓవర్సీర్, టెక్కలి - (శ్రీకాకుళం జిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# పాఠకుల ప్రశంసలు

[ఈ జన్మదిన ప్రత్యేక సంచిక సందర్భంలో ప్రశ్నోత్తరాల శీర్షికకు మారుగా పాఠకులు "చందమామ"కు అప్పుడప్పుడూ పంపుతూ వచ్చిన ప్రశంసలూ, ఆశీస్సులూ ప్రకటిస్తున్నాము. అయాచితంగా పంపిన ఈ ప్రశంసలు చూసి మాకు కలిగిన ఆనందాన్ని ఈ విధంగా పాఠకులందరితోనూ పంచుకుంటున్నాము. —సంపాదకుడు.]

నేటి పత్రికలలో మేటి అని కీర్తిగాంచి, ప్రతి నెలా నిత్యనూతనంగా పెండ్లినాటి వధువులా అలంకరించుకొని, పాఠకుల హృదయాలను రంజింపజేస్తూ, నేటివరకు ఏ పత్రికా సాధించలేని ఘన విజయాన్ని "చందమామ" సాధించిందనడంలో అతిశయోక్తి లేదు.

—*ఆదిమూలం కృష్ణారావు, జయపురం*

కనులపండువులాంటి "చందమామ"... ఇన్ని రంగులతో, పేజిపేజీకి చిత్రాలతో నిండిన పత్రిక వేరే మేము చూడలేదు. ఏది ఎక్కువ బాగుందీ అంటే, ఒకటి జిలేబి, ఇంకోటి జామూను, మరోటి లడ్డూనూ.... ఈ రీతిగానే "చందమామ" నెలనెలా చక్కటి వెలుగుతో వర్ధిల్లాలని మన మందరమూ వేడుకుందాము. —*బర్మా సీతాలక్ష్మమ్మ, సరోజ, చింతలపూడి*

బాల బాలిక, యువతీ యువకులకు కావలిసిన వన్నీ మీ పత్రికమూలంగా అందిస్తున్నారు....పత్రిక ఇంత ప్రజాప్రియం అగుటకు కారణము చిత్రాలంటే నమ్మండి. —*ఎన్. చిదంబరశాస్త్రి, బళ్ళారి*

"చందమామ" సారస్వతాకాశంలో చందమామే!...."చందమామ" కాంతి భారతదేశమంతటా ప్రసరిస్తూంది. —*"ఉత్తరాషాఢ", మకుకువ*

మీ పత్రిక పిల్లలకోసం ఉద్దేశించబడిందే అయినా, పెద్దలెవరూ చదవకుండా విడవటంలేదు. జనంలోని "శిశుమనస్తత్వాన్ని" కవ్విస్తున్నది మీ పత్రిక. మీరు వేస్తున్న శీర్షికలు లోకప్రియంగా ఉన్నాయి.

—*కె. జి. లక్ష్మిరెడ్డి, కాశీపురం*

మన "చందమామ" దినదినాభివృద్ధి చెందవలయు ననియు, ఆచంద్రార్కము దివ్యజ్యోతివలె, ఆసియాజ్యోతివలె ప్రకాశించవలయు ననియు మా ముద్దు దీవెనలు. పి. మల్లికార్జునరావు, —?

"చందమామ"ను ఎంతోమంది యువకులు, వృద్ధులు కూడా పట్టుదలతో చదువుచున్నారు. దానికి కారణం దానిలో వున్నటువంటి విజ్ఞాన, వినోద, వికాసాలు, ముచ్చటైన బైండు, కనుల కింపగు చిత్రములు, సరళమైన మరియు కమ్మనైన భాష, అక్షరజ్ఞానం వున్న తక్కువ చదువరులకు కూడా అర్థమయ్యే సాహిత్యం.

—ఎస్. కాళిదాసు, షాలిమార్

మన దేశంలో అనేక భాషలలో తయారవుతున్న పిల్లల పత్రికలలో "చందమామ"కు మించినది లేదని రూఢిగా చెప్పవచ్చును.

—బి. రామకృష్ణ, నరసరావుపేట

ప్రతి నెలా "ఫస్టు" తారీకు రాగానే "చందమామ"కోసరము నేను, మా అన్నయ్య ఇద్దరము వెళ్లి కొని, ఒకరి తరవాత ఒకరు చదువుకుంటాము. "చందమామ" చదువుచున్నకొలది ఇంకా చదవాలనే అనిపిస్తుంది. ఇంత చక్కటి కథలు అందజేయుచున్నందులకు మీకు నా నమస్కారములు.

—యం. రమణి, తాడేపల్లిగూడెం

"చందమామ"కు లోపము ఎవరు చెప్పగలరు?... మరి వెయ్యి సంవత్సరములపాటు మీ "చందమామ" వర్ధిల్లుగాక!

—డాక్టర్ పిల్లా తులసీదాసు, రాయగడ

వినూత్న వెలుగుతో, విశాల భావాలతో, అనూహ్య ఆశయసిద్ధికై విజ్ఞానామృత ధారలు కురిపిస్తూ, అనంతమైన ఆకర్షణలతో, విడనాడని ఉత్సాహాన్ని రేకెత్తించే "చందమామ"ను నిండు జాబిలిలా ప్రకాశింపజేస్తూవున్న మీ ప్రజ్ఞకు నా అభివందన శతకోటి పుంజములు.

—యం. రామస్వామి, బి. కామ్., ఏలూరు

మీ "చందమామ" పండుగలలో పండుగ, చీకటిని వెన్నెలచేయు దీపావళి పండుగ మాదిరిగ పిన్నలకూ, పెద్దలకూ సంతోషం కల్గిస్తోంది... భగవంతుని అనుగ్రహముచేత "చందమామ" ఎల్లకాలము చిరంజీవిగ ఉండుగాక!

—టి. పుష్పవేణి, హైదరాబాదు

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు వాళ్ల మొక్కజొన్న చేను దగ్గరకు వెళ్ళేసరికి, చేలో వుండవలసిన దిష్టిబొమ్మ కనిపించలేదు. మొక్కజొన్న కండెలు ఎవరో విరుచుకు పోయినట్టుకూడా కనబడింది. చేలో ఒక మూల కాకుల గుంపు కనిపించింది. దాసూ, వాసూలు అక్కడికి వెళ్ళేసరికి దిష్టిబొమ్మ ఒక బుట్ట నిండుగా మొక్కజొన్న కండెలు పట్టుకుని గంతులేస్తూ, వాళ్లమీదికి రాసాగింది. ఈలోపల 'టైగర్' వెనగ్గా వెళ్ళి దిష్టిబొమ్మ కాలు పట్టుకున్నది. దానితో దిష్టిబొమ్మ "బాబో" అంటూ కేకపెట్టి, కండెలబుట్ట వదిలి పారిపోసాగింది. దిష్టిబొమ్మకు కట్టిన పాతగుడ్డలు తొడుక్కుని దొంగతనం చేస్తున్న ఆ కుర్రాణ్ణి "టైగర్" తరిమింది.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

